ఈ సంపుటిలో:

కూలిన కుటీరం
ఒకే రాత్రి
శాస్త్రీయ నవల
సమర్పణ



# అంకితం:

మిత్రులు

సి. నాగేశ్వరరావు M. B., B. S. గారికి.

— అనువాదకుడు

# కూలిన కుటీరం

భూపతి పనిపాటల ప్రసక్తి లేకుండా, ఇంటిపట్టున కూర్చున్నా, అతని జీవితం సుఖంగా గడిచిపోతుంది, కారణం అతను ఆగర్భ శ్రీమంతుడు! అసలే ఉష్ణదేశం! ఆపైన అతనిది 'కర్మిష్ఠి జాతకం'. అందువల్ల ఇంగ్లీషు దినపత్రిక నెలకొల్పటం తప్పనిసరి అయింది. తర్వాత పొద్దుపోవటంలేదని యెప్పటికీ చింతించనక్కరలేకపోయింది!

అతను బాల్యంనుంచీ ఇంగ్లీషులో ఉపన్యసించట మన్నా, ఇంగ్లీషులో వ్రాయటమన్నా, చెవి కోసుకునేవాడు. అవసరం లేకపోయినా, 'సంపాదక లేఖలు' వ్రాసి పంపేవాడు. చెప్పవలసింది లేకపోయినా, సభల్లో సమావేశాల్లో ఉపన్య సించేవాడు. రాజకీయ నాయకులుకూడా తమ పార్టీలో చేర్చు కునే తలంపుతో అతని గుణగణాలను ప్రశంసించకపోలేదు. వీటన్నిటి ఫలితంగా, రానురాను రచనాశక్తిమీద అతని అభిప్రాయం దృఢపడసాగింది.

భూపతిబంధువు ఉమాపతికూడా, ప్లీడరువృత్తి కట్టి పెట్టి, బావగారి సహాయార్థం వచ్చాడు. "నీవు ఇంగ్లీషు దిన పత్రిక పెట్టాలి. అప్పుడు నీ కలానికి ఎదురేమిటి?..."

భూపతి బాబులో ఉత్సాహం వెల్లివిరిసింది. పరాయి పత్రికల్లో రచనలు సాగించినందువల్ల వారికేదేమీ లేదు. స్వంత పత్రికలో అయితే, స్వతంత్రలేఖిని నిరాటంకంగా

స్వేచ్ఛావిహారం చేస్తుందని మనసులో అనుకున్నాడు. ఆ తర్వాత కొద్దిరోజులకే ఉమాపతి సహాయ సంపాదకుడు అయ్యాడు; బావ భూపతిబాబు పత్రికాయానలో సంపాదక పదవిని సలంకరించాడు.

ముఖ్యంగా, రాజకీయాలు, సంఘాదికీయాలు యువావస్థలో ఒక విషామాదిరి తమ ప్రాబల్యాన్ని సాపుకుంటవి; దానికితోడు భూపతిని 'పురికొల్పి' అందలమెక్కించే' వారికీ తరుగు లేదు! ఈ విధంగా భూపతి పత్రికా నిర్వహణలో తలమునకలయ్యాడు. అతని బాలవధువు శ్రీమతి చారులత నెమ్మదిగా యవ్వనంలో అడుగుపెడుతూవుంది. వార్తాపత్రికా సంపాదకుని దృష్టిమాత్రం ఈ అత్యావసర వార్తవైపుదికి పోలేదు. అప్పుడు భూపతిబాబు క్రమేపీ హద్దుమీరిపోతున్న ప్రభుత్వ దమననీతిని ఖండించటంలో తన్మయుడై వున్నాడు!

భర్త ధనవంతుడు. అందువల్ల చారులత ఇటు పుల్లతీసి, అటు పెట్టనక్కరలేదు. పరిపూర్ణమైన జీవితావశ్యకతల మధ్య ఫలించని పుష్పంమాదిరి అహోరాత్రులూ వికసిస్తూ వుండటంచే, ఆమె నిష్క్రియజీవితానికి పరమావధి అయింది. ఆమెకు దేనికీ తరుగులేదు; నిర్విరామంగా ఆమోదప్రమోదాల్లో గడిచిపోతూవుంది. ఇలాంటి తరుణంలో కులకాంతలు భర్తను రాచి రంపానబెడతారు—దాంపత్య ధర్మము కుటుంబ మర్యాదలను వుల్లంఘించి, సంయమము అసంయమానికి, విహితము అవిహితానికి దారితీస్తుంది. కాని చారులతకు ఆ అవకాశం కూడా లభించలేదు.-వార్తాపత్రిక భిత్తిని ఛేదించి, భర్త మీద పెత్తనం చేయటం, ఆమెకు కష్టమయింది.

బంధువుల్లో ఒక వృద్ధురాలు, యశ్వోదవతి అయిన భార్యా విషయం యేమీ పట్టించుకోనందుకు, భూపతిని గట్టిగా మందలించింది. అప్పుడు అతనికి నిద్రమత్తు వదిలినట్లుంది.

"నిజమే, చారుకు వొక చెలికత్తె అవసరం. పొద్దస్తమానం ఇంట్లో వొంటరిగా కూర్చుంటే, యెలా ప్రొద్దుపోతుంది?"

ఆ సందర్భంలోనే వొకరోజు భూపతిబాబు— 'మీ వాళ్ళను ఇక్కడికి తీసుకురాకూడదూ? తనయింటివాళ్ళెవరూ తోడు లేక, చారుకు బావురుమంటూవుంది!" అని చెప్పాడు వుమాపతితో.

'స్త్రీ సాంగత్యాభావమే' చారుకు దుఃఖదాయకంగా వుందని మాత్రం సంపాదకునికి అర్ధమయింది. తర్వాత తన బావమరిది భార్య మందాకినిని ఇంటికి తీసుకొచ్చి, నిశ్చింతు డయాడు భూపతి!

దంపతులు ప్రథమ ప్రేమోన్మాద అరుణాలోకంలో పరస్పరం వొకర్ని వొకరు అపూర్వమహిమతో నిత్యనూతనులుగా భావిస్తారు; సువర్ణ కాంతులతో విరాజిల్లే దాంపత్య జీవితంలోని ఆ వుషఃకాలము అచేతనావస్థలో యెప్పుడు అదృశ్యమవుతుందో యెవరూ గ్రహించలేరు. ఈ నూతనదంపతుల విషయంలో కూడా సరిగా అదే జరిగింది. నూతనత్వాన్ని చవి చూసేముందే, ఇద్దరూ వొకరికొకరు పరిచితులు, అభ్యస్తు లయిపోయారు.

చారులతకు చదువు సంధ్యలంటే, మహా ఆసక్తి అందు వల్ల ఆమెకు కాలంగడవటం భారమనిపించలేదు. స్వయంకృషితోను, నేర్పుతోను చదువుకోటానికి యేర్పాటు చేసుకుంది.

భూపతి మేనత్తకొడుకు అమలుడు, కాలేజిలో 'థర్డియరు' చదువుతున్నాడు. చారు అతనిదగ్గరే చదువుకునేది; ఆమాత్రానికేగాను కొన్ని ఉత్పాతాలు సహించవలసివచ్చేది. తరచుగా అతనికి తన్నివాళ్ళ హోటల్లో భోజనానికి, ఇంగ్లీషు పుస్తకాలకు ముడుపు చెల్లించాలసివచ్చేది. ఇదిగాక, అమలుడు అప్పుడప్పుడు స్నేహితులకి విందులుచేసేవాడు; ఆ భారమంతా ఆమె గురుదక్షిణగా వహించవలసి వచ్చేది! భర్త భూపతి ఆమెను యేమీ అపేక్షించేవాడుకాడు. కాని భర్త మేనత్తకొడుకు కాసేపు చదువు చెప్పిన నేరానికి, మితిలేని ఉత్తరువులు జారీ చేసేవాడు. చారు మధ్య మధ్య కృత్రిమ క్రోధాన్ని, వ్యతిరేకతను వెలిబుచ్చేదికాని ప్రయోజనం శూన్యం! దేనికో వొక దానికి, వొకరికి ఉపయోగపడటమూ, స్నేహపూరిత ఉత్పాతాలు సహించటమూ ఆమెకు చాల ఆవశ్యకమయింది.

ఒకనాడు అమలుడు ఇంట్లో అడుగు పెడుతూనే —"వదినా, మా కాలేజీలో రాజాగారి అల్లుడు చదువుతున్నాడు. అతను ఈవేళ అంతఃపురాంగనల చేతితో అల్లిన మేజోళ్లు వేసుకు వచ్చాడు—నాకు జెర్రులు పాకినట్లుంది. వదినా, నాకూ అలాంటి మేజోళ్ళు కావాలి, లేకపోతే నా చదువు మర్యాదలు మంటగలిసినట్టు!" అని చెప్పాడు.

"నాకు ఏమైనా పనివుందా! రాత్రింబవళ్ళు నీకు మేజోళ్ళు కుట్టటంతప్ప—డబ్బులిస్తాను, బజారులో కొనుక్కోరాదూ!"

"అలా వీల్లేదు!"

చారుకు ఆ అల్లిక చేతకాదు, కాని ఆమాట అతని ముందర ఒప్పుకోవటం ఆమెకు ఇష్టంలేదు. అమలుడు నోరు విప్పి అడిగినప్పుడు, అతని ప్రార్థనను ఎలా మన్నించకుండా ఉండగలదు? ఈ ప్రపంచంలో తనను అడిగేదిమాత్రం ఎవరున్నారు? అతను కాలేజీకి వెళ్ళినప్పుడు, చాటుమాటుగా, చాలా శ్రద్ధతో ఆ అల్లిక నేర్చుకునేది. అతను మేజోళ్ళసంగతి పూర్తిగా మరిచిపోయినాక, ఒకరోజుసాయంత్రం ఆమె అతనిని ప్రత్యేకంగా ఆహ్వానించింది.

అది ఎండాకాలం. డాబామీద అమలుడికి పీటవేసి, పీటముందర పళ్ళెం ఉంచింది. పళ్ళెంమీద మూతవుంది. అతను కాలేజి దుస్తులుమార్చి, కాళ్ళూచేతులు కడుక్కొని టిప్‌టాప్‌గా పైకివచ్చాడు. అతను పీటమీదకూర్చుని మూత తీశాడు—కన్ను చెదిరేట్లు అల్లిన వులెన్ మేజోళ్ళు వున్నవి. చారులత విరగబడి నవ్వుతూంది!

మేజోళ్ళు చూసి, అతని కోరికలు మోసులెత్తసాగినవి. ఒకసారి మఫ్లరు కావాలనేవాడు, మరొకసారి చుట్టూ లతలు పూలు అల్లిన జేబురుమాలు కావాలనేవాడు! ఒకనాడు బయట గదిలో నూనె డాగులుపడిన యీజీచైరుకు పట్టు గలీబు-అల్లిక పని చేసినది-కావాలని పురమాయించాడు.

పైపైకి చారులత కాదు పోట్లాడేది కాని ప్రతిసారి శ్రద్ధాసక్తులతో ఆ విలాసపురుషుని కోరిక మన్నించేది! అమలుడు నడుమ నడుమ—"వదినా, ఎంతవరకు అయింది!" అని అడిగేవాడు. "యింకా మొదలు పెట్టందే! అసలు నాకు ఆ విషయమే గుర్తులేదు" అని అబద్ధాలు చెప్పేది!

కాని అమలుడు అంతటితో విడిచిపెట్టే జీవికాదు. రోజూ గుర్తుకు తెస్తూ, అభిమానం చూపేవాడు. అలా వెంట పడి పీడించే అమలుని రెచ్చగొట్టటానికే ఆమె ప్రదాసీనత వెలిబుచ్చేది! తర్వాత అకస్మాత్తుగా వొకనాడు అతని వేడుక మన్నించి, తమాషా చూస్తుండేది.

శ్రీమంతుడైన భర్త గృహంలో ఆమె ఎవరికోసమూ చిన్నమెత్తు పని చేయనక్కరలేదు. కాని అతనొక్కడే ఆమెకు యేదో ఒకపని కల్పించకుండా వూరుకునేవాడు కాదు! మొత్తం మీద ఈ పనులతో ఆమె హృదయ ప్రవృత్తి సార్థకమవుతూందని గట్టిగా చెప్పవచ్చు.

భూపతి అంతఃపురంలోని కాళీ జాగాను వుపవనమంటే అతిశయోక్తి అవుతుంది. అందులో ముఖ్యమైనది వుల్ల మామిడి వొకటివుంది వృక్షజాతికి సంబంధించి నంతవరకు. దాని అభివృద్ధికి చారు, అమలుడు - వీరిద్దరితో కమిటీ ఏర్పడింది. కొన్నాళ్ళనుంచి ఇద్దరూ కలిసి కాగితాలమీద మహావుల్లాసంతో వుపవనానికి రూపురేఖలు దిద్దుతున్నారు.

"వదినా! మన వనంలో పూర్వకాలపు రాకుమార్తె మాదిరి నీవు స్వహస్తాలతో మొక్కలకు నీళ్ళుపోయాలి!"

"వెనకపక్కన మృగ శాబకాలకు వొక గృహం వుండాలి."

"హంసలు విహరించడానికి, చిన్న కోనేరుకూడా వుండాలి!"

చారు ఈ ప్రస్తావనకు వుల్లాసపడుతూ—"అందులో నీల కమలాలుకూడా అవసరం—నాకు చాలా కాలంనుంచి నీలికమలాలు చూడాలనివుంది!" అని చెప్పింది.

"ఆ కొలనుమీద వంతెన; రేవుదగ్గర చిన్న బోటు!"

"రేవు చలవరాతితో కట్టాలి."

అతను కాగితము పెన్సిలు తీసుకని రూళ్ళకొట్టి, కంపాసుతో స్కెచ్ గీశాడు. తర్వాత ఇద్దరూ నిత్యమూ మార్పులు, చేర్పులు చేస్తుండేవారు. ఇలా ఇంచుమించు పాతిక, ముప్పయిదాకా తయారయినవి!

ప్లాను పూర్తయినాక, ఎస్టిమేటు తయారవుతూ వుంది. చారులత స్వంతఖర్చులు తగ్గించుకుని, ఆ డబ్బుతో నెమ్మదిగా ఉపవన నిర్మాణం చేయించాలని నిర్ణయం జరిగింది. భూపతికి అసలు ఇంట్లో, ఎక్కడ యేమిజరిగేదీ తెలియదు. పని పూర్తి అయినాక భర్తను ఒకనాడు ఆహ్వానించి, చకితుణ్ణి చేయాలని చారు యోచించింది. 'అల్లావుద్దీన్ మాజిక్ లాంపు' సహాయంతో జపానునుంచి ఈ ఉద్యానవనం తెచ్చి యిక్కడ పెట్టారని వారు తలుస్తారు!

కాని ఎస్టిమేటు ఎంత పొదుపుగా చేసినా, ఆమెకు నచ్చలేదు. అంత డబ్బు యెక్కడనుంచి తెస్తుంది? అందువల్ల చాలా మార్పులతో అమలుడు మరొక ప్లాను సిద్ధంచేశాడు.

"అయితే ఒకపని చేద్దాం వదినా, కొలను విషయం అలా ఉండనివ్వు, తర్వాతచూద్దాం. ఏం, అంతేనా?"

"కాదు కాదు, కొలను లేకపోతే యెన్నివున్నా ఆ అందచందాలు రావు! నీలకమలాలు అందులో సదా పుష్పించేది!"

"అయితే మృగశాబకాలను చిన్న కటకటం, రెల్లుతో వేస్తే పని జరిగిపోతుంది!"

అందుకు ఆమె కోపగించుకొని—"పోనివ్వు, అసలు నాకు యేమీ అక్కర్లేదులే!" అంది.

మారిషస్‌నుంచి లవంగలతలు, మైసూరునుంచి చందనపు మొక్కలు, సిలోనునుంచి పాల్మీన మొక్కలూ తెప్పించాలని మొదట్లో అనుకున్నారు. అమలుడు వాటికి బదులు **మానికతల్లా**నుంచి దేశవిదేశాలవి కొన్ని మొక్కలు తెద్దామని చెప్పాడు. అందుకు చారులత మొహమింత చేసుకుని — "అయితే, నాకు ఉపవనమే అక్కర్లేదు!" అంది.

ఎస్టిమేటు తగ్గించటానికి యిది సరియైన పద్ధతి కాదని అందరికీ తెలుసు. కాని ఎస్టిమేటుతో పాటు తన కోరికలు చంపుకోవటం ఆమెకు దుర్ఘటం! అమలుడు పైకి యెంతా మాట్లాడినా, అతనికీ యిది మనస్కరించలేదు.

"సరిగా, నీవు ఉపవనాన్ని గురించి అమ్మాయితో యెందుకు చెప్పవు — తప్పక డబ్బు యిస్తాడు!"

"లేదు, వారితో చెప్పితే తమాషా యేముంది? మన మిద్దరమే ఉపవనం నిర్మించాలి. వారికో అ జే. మరొక 'ఈడెన గార్డెను' తయారవుతుంది. అప్పుడు మన ప్లాను యేం కాను?"

ఆ యిద్దరూ మామిడిచెట్టు నీడను కూర్చుని, కల్పనా లోకంలో విహరిస్తున్నారు. అంతలో చారులతబిడ్డ మందాకిని మేడ మీదనుంచి పిలిచి...."వేళ మిగిలిపోయింది, మీరిద్దరూ యేంచేస్తున్నారక్కడ ?" అంది.

"మామిడికాయలు దొరుకుతవేమోనని చూస్తున్నాను" అంది చారులత

పులుపంటే నోరూరే మందాకిని — "దొరికితే, నాకూ కొంచెం పట్టుకురా" అంది.

చారు, అమలుడు నవ్వుకున్నారు. ఆ ఇద్దరి సంకల్పాలలో ప్రధానమైన ఆనందము, గౌరవము, బాహ్యప్రపంచముతో సంబంధము లేకపోవటమే! మందాకినిలో ఇతర సుగుణాలు యెన్ని వున్నప్పటికీ, కల్పనాశక్తి బొత్తిగా లేదు; ఆమె ఈ విషయాల్లో స్వారస్యం యెలా పొందగలదు? అందువల్ల ఆమె వీళ్ళ కమిటీలన్నిటికీ దూరంగా వుండిపోయింది.

చివరికి ఆ ప్రవచనం యెప్పటిమాటూ తగ్గలేదు, వారి కల్పనా శక్తి పరాజయాన్ని స్వీకరించలేదు. అలా కొన్నాళ్ళపాటు చెట్టుక్రింద కమిటీ సమావేశం జరుగుతూనే వుంది. యెక్కడ కోనేరు తవ్వించాలో, యెక్కడ రాతి అరుగు కట్టించాలో అమలుడు ప్రక్క కొమ్మలతో గుర్తులు పెట్టాడు.

అనాడు అమలుడు మామిడిచెట్టుక్రింద యెక్కడ అరుగు కట్టాలో, రిబ్బను గోటితో చుట్టూ గుర్తు పెడుతున్నాడు. అంతలో చారువచ్చి, చెట్టునీడను కూర్చుని — "అమల్, నీకు వ్రాత అలవాటువుంటే చాలా బాగుండేది!" అంది.

"ఎందుకని?"

"ఈ వృపవనాన్ని వర్ణిస్తూ, నీచేత వొకకథ వ్రాయించే దానిని! ఆ కథలో, కొలనూ, నీలకమలాలు, మామిడిచెట్టూ అన్నీ వుండేవి. మనిద్దరికి మినహా, యెవరికీ యేమీ అర్థమయేది కాదు. బలేతమాషాగా వుండేది! ఒకసారి ప్రయత్నించి చూడు—నీవు తప్పక వ్రాయగలవు!"

"సరే, నేను వ్రాస్తే, యేమి బహుమానమిస్తావు?"

"యేంకావాలి?"

"నా దోమతెరమీద లతలు పూలు మంచి పట్టుతో అల్లాలి."

"యిదే నీ ఆగడం! యెవరైనా దోమతెరకు అల్లు కుంటారూ!"

దోమతెరవంటి పదార్థాన్ని అందచందాలులేని చెత్త సాలగా వుంచటానికి వ్యతిరేకిస్తూ, యెన్నో యుక్తులు చూపాడు. "ప్రపంచంలో పదిహేను అణాలవంతు ప్రజ సౌందర్యమనేది యెరుగదు. ఆ సౌందర్యం వారిని బాధించక పోవటమే మనకు మంచి తార్కాణం!"

చారు లోలోపల యిందుకు సమ్మతించింది. ప్రపంచంలో వారిద్దరి కమిటీకి సంబంధం లేనందుకుకూడా ఆమె చాలా వుల్లాసంగా వుంది. "అలానే అల్లియిస్తాను. కాని నీవు వ్రాయాలి!"

అమలుడు సాభిప్రాయంగా - "నేను వ్రాయలేనని నీకు సందేహమా?" అన్నాడు.

చారు వుత్తేజితురాలై - "అయితే, యేదో వ్రాసినట్టుందే! నాకు చూపించవూ?" అంది.

"ఇవాళ వద్దులే వదినా!"

"కాదు ఇవాళే! నా మీదనొట్టే, వ్రాతప్రతి ఇవ్వాడు తీసుకురాకపోతే!"

నా సవానికి, తనరచన చదివి వినిపించాలనే తీవ్ర అభిలాషే ఇంతసేపూ అతనిని నిలిపింది. ఆమెకు అర్థంకాదేమోనని, నచ్చదేమోనని సందిగ్ధావస్థలో పడ్డాడు. అతను వ్రాతప్రతితెచ్చాడు. మొహం యెర్రవారింది. గొంతు సవరించుకుని చదవనారంభించాడు—"ఓ నా శుభ్రవ్రాతప్రతి! ఇంతవరకు నిన్ను కల్పన స్పృశించలేదు. నూతికాగృహంలో భాగ్యపురుషుడు ప్రవేశించే పూర్వము శిశు లలాటఫలకంమాదిరి నీవు నిర్మలమూర్తివి, రహస్యమయివి. నీ చివరిపేజీలో చివరివంక్తిలో ముగింపు వ్రాసేదెన్నటికో! నీ యీ శిశులేఖలు నేడు ఆసమాప్తిని స్వప్నంలో కూడా ఊహించలేకపోతున్నవి."

చారు చెట్టునీడను సుఖంగా కూర్చుని ఆలకిస్తూవుంది. చదవటం అయినాక కొంచెంతాళి—"నీవు వ్రాయలేనన్నావు గదూ!" అంది.

అమలుడు ఆనాడు ప్రప్రథమంగా మాదక సాహిత్యరసాన్ని చవిచూశాడు. కొంగ్రొత్తరచన, కొంగ్రొత్తసాకి! మూడవజాము సూర్యరశ్మి, దీర్ఘమైన నీడలుపడటంవల్ల రహస్యమయమవుతూంది.

ఉద్యానవన సంకల్పం, ఇతరసంకల్పాలమాదిరే, అనంత కల్పనాక్షేత్రంలో యెప్పుడు అడుగునపడిపోయిందో వారిద్దరిలో యెవరికీ తెలియలేదు. ప్రస్తుతం అమలుని రచనలవిూదనే ముఖ్యంగా చర్చజరుగుతూంది. "వదినా, నాకొక నూతన

భావం స్ఫురించింది!" అనేవాడు అమలుడు. చారు ఉత్సాహంతో లేచి— "పద, దక్షిణపక్క వరండాలోకి వెళ్లాము, అక్కడే వింటాను. మందాకిని తాంబూలంకోసం ఇక్కడికి వచ్చే వేళ అయింది!" అనేది.

చారు వరండాలో పేముపడకకుర్చీలో కూర్చునేది; అమలుడు మెట్లగోడ క్రిందిభాగాన్ని ఆసనం చేసుకు నేవాడు.

సాధారణంగా అమలుని రచనలు విస్పష్టంగా ఉండేవి కావు; ఒక విషయాన్ని వివరించి చెప్పాలంటే, అతనికి కొంతు పట్టుకున్నట్టుండేది. అనేకవిషయాలు కలగాపులగం చేసిన అతని వ్రాతలు అర్థంకావటం ఎవరికైనా కష్టమే! అతను తనే అటుండేవాడు— "నీకు చక్కగా వివరించలేకపోతున్నాను వదినా!"

"లేదు లేదు, నాకు చాలాభాగం అర్థమవుతూ ఉంది. నీవు త్వరగా పూర్తిచెయ్యి!" అని చెపుతూ ఉండేది.

ఆమెకు కొంత అర్థమయినా, కొంత అర్థంకాక, కొంత వరకు వూహించుకుని, కొంతవరకు అతను ఆవేశంతో వ్యక్తీకరిస్తుంటే, ఉత్తేజితురాలయి, మనసులో ఏ భావాన్ని చిత్రించుకుందో చెప్పలేము. కాని అది ఆమెకు సుఖాన్ని, హాయిని ఇచ్చేది. రచన పూర్తికానందుకు ఆమె తహతహ లాడిపోయేది. ఆసాయంత్రమే— ఎంతవరకు వ్రాశావు?" అని అడిగేది. అమలుడు— "అంత త్వరగా ఎలాపూర్తవుతుంది?" అనేవాడు. చారులత మరునాడు ఉదయమే మళ్ళీ చిరుకోపంతో —"ఇంకా పూర్తి కాలేదా?" అని ప్రశ్నించేది. "కొంచెం ఆలోచించుకోనివ్వు వదినా!" అనేవాడు అమలుడు. ఆమె కోపగించుకుని— "పోనీ, నాకెందుకు లే!" అనేది.

సాయంత్రానికి ఆకోపం యిసుమడించి, మాటలు బందయే పరిస్థితి వచ్చేటప్పటికి, అమలుడు జేబురుమాలు తీసే నెపంతో, వ్రాతకాగితాలు జేబులోనుంచి కొంచెం పైకి కన్పరచేవాడు! మరుక్షణమే మా గనోపు విడిచిపెట్టేది.
"పూర్తి చేశావే! నా దగ్గర అబద్ధమా! చూపించవూ?"

"ఇంకా పూర్తి కాలేదు, మిగతాది వ్రాసి, తర్వాత వినిపిస్తాను."

"అలా కాదు, నేను ఇప్పుడే వినాలి!"

అమలుడు 'తక్షణమే వినిపించాలని తహతహ లాడే వాడు. కాని కాసేపు వొకరి చేతుల్లోనుంచి మరొకరు కాగితాలు లాక్కోవటానికి ప్రయత్నించనిదే, విన్పించటం యిష్టం లేదు. ఆ తర్వాత పేజీలు సరిచేసి, పెన్సిలుతో వొకటి రెండు చోట్ల దిద్దేవాడు. అంతలో చారులత జలభారవినమ్ర మేఘ మాలికవలె ద్విగుణీకృత కుతూహలంతో ఆ వ్రాత ప్రతి మీదికివంగి చూస్తుండేది. ఇలా అమలుడు ఎప్పటి కప్పుడు వ్రాసినంతవరకు విన్పించవలసివచ్చేది. సశేషాన్ని గురించి విమర్శ ప్రతివిమర్శలు జరుగుతుండేవి.

ఇంతవరకు ఈ తరుణహృదయాలు ఆకాశ కుసుమ సంగ్రహంలోనే చిక్కుకుని వున్నవి కాని యిప్పుడు కావ్య కుసుమకృషి ప్రారంభమయినందువల్ల మిగతా విషయాలన్నీ విస్మరించారు.

ఒకనాడు సాయంకాలం అమలుడు కాలేజీనుంచి వచ్చాడు. అతని జేబు కొంచెం భారంగా ఉన్నట్టుంది. అతను ఇంట్లోకి అడుగు పెడుతుండగానే, చారులత కిటికీలోనుండి

అతని నిండు జేబు కేసి చూసింది. అతను ప్రతిరోజూ కాలేజీ నుంచి తిన్నగా లోపలికి వచ్చేవాడు. కాని ఈవాళ ఆ నిండు జేబుతో బైటి గదిలోనే వున్నాడు. లోపలికివచ్చే చిన్నెలేమీ కన్పించటంలేదు. చారులత బయటిదాకావచ్చి అనేక సారులు గాజులు గలగలమనిపించింది కాని ఎవరూ విన్పించుకున్నట్టు లేదు. చివరకు ఆమె కోపగించుకుని, తన వరండాలోకి వెళ్ళి మన్మధదత్తు రచించిన పుస్తకం తీసుకుని చదవ ప్రయత్నించ సాగింది.

మన్మధదత్తు నవీన రచయిత. అతని శైలి చాలవరకు అమలుని శైలితో పోలిఉంటుంది. అందువల్ల అమలుడు అతనిని ప్రశంసించటం అలావుంచి, అప్పుడప్పుడు చారులత దగ్గర అతనిరచనలు వికృత వుచ్చారణతో చదివి, హేళన చేసే వాడు. ఆమె అమలుని చేతిలోనుంచి పుస్తకం లాక్కుని దూరంగా విసిరి వేసేది. కాని ఆమె యివాళ అమలుని పాదాల చప్పుడు వినగానే ఆ మన్మధదత్తు 'కలకంఠ' కావ్యము మహా శ్రద్ధాసక్తులతో పఠిస్తూవుంది. అమలుడు అక్కడికివచ్చాడు. కాని ఆమె కన్నెత్తి అటు చూడలేదు.

"ఏమిటి వదినా చదువుతున్నావు ?"

ఆమె జవాబు చెప్పలేదు. అమలుడు ఆమె వెనుకకు వెళ్ళి నిలబడి, పుస్తకంపేరు చదివి—"బలే! మన్మధుని 'జలగండ'మా!" అన్నాడు.

"అబ్బ! నన్ను వేధించవద్దు. చదువుకోనివ్వు."

అమలుడు ఆమె వెనుక నిలబడి వ్యంగ్యస్వరంతో చదవనారంభించాడు—"నేను తృణాన్ని; క్షుద్ర తృణాన్ని.

రక్తాంబర రాజవేషధారివయిన అశోకవృక్షమా, నేనొక తృణమాత్రుణ్ణి! నాకు పూలుగాని, నీడగాని లేవు. తలయెత్తి ఆకాశం చూడలేను. వసంతకోయిల నన్నాశ్రయించి 'కుహూ, కుహూ' రవంతో ప్రపంచాన్ని మైమరపించదు— అయినా నీవు వినయబూనిన నీ ఉన్నత శాఖలతో నన్ను ఉపేక్షచేయవద్దు. నీకు ప్రణమిల్లుతున్నాను. నేను తృణమాత్రుణ్ణని నన్ను హీనంగా యోచించవద్దు" అతడు ఇంత వరకు పుస్తకంలోనిది చదివి, తర్వాత తనతరఫున కొంతకలిపి మళ్ళీ ప్రారంభించాడు. "నేను అరటితొక్కను, నీవో గృహోవరిసీమల విహరించే ఆవకాయవు!"

ఆమెకు కుతూహలంతో కోపం రాలేదు. పక్కున నవ్వింది పుస్తకం దూరంగా విసరేసి "నీవు వట్టి మప్పాతివి. ఇతరుల రచనలంటే కళ్ళల్లో నిప్పులు పోసుకుంటావు!" అంది.

"కాని నీ ఔదార్యానికి చెప్పుకోవాలి. తృణమాత్రం లభించినా చాలు, నీవు జీర్ణం చేసుకోవాలను కుంటున్నావు!"

"సరేగాని మహాశయా, ఆ జేబులో దేమిటో ముందు బయటికి తీయండి."

"ఏమిటో నీవే చెప్పు?"

అతను చాలసేపు చారులతను వేధించి, జేబులోనుంచి సుప్రసిద్ధ మాసపత్రిక 'సరోరుహము' బయటికి తీశాడు. అమలునిరచన 'నా ప్రాతప్రతి!' ఆ మాసపత్రికలో ప్రచురించి వుంటారని ఆమె వూహించింది.

రచన చూసి ఆమె యేమీ మాట్లాడలేదు. చదివి చాల ఆనందిస్తుందని అతను ఆశించాడు కాని ఆ చిన్నెలేమీ గోచరించలేదు. "వదినా, యీ పత్రికలో మా మిత్రుల రచనలకు తావు యిస్తారు. అర్థమయిందా ?"

అమలుడు చెప్పినదానితో కాంచన అత్యుక్తిలేక పోలేదు. వారపత్రికకి, మార్కెటులో చెలామణి అయ్యే రచనలు దొరికితే, ప్రచురించకపోవటమనేది జరగదు. కాని అతను వివరించటం మానలేదు. "సంపాదకుడు చాల గట్టివాడు. ఎందరు రచనలు పంపితే, ఒకటికూడా నచ్చుతుందో, లేదో!"

అందుకు చారులత సంతోషించటానికి ప్రయత్నించింది కాని ఆమెకు సాధ్యం కాలేదు. తన మనసుయొందున నొచ్చుకున్నది గ్రహించాలనుకుంది కాని తగిన హేతువేమీ కన్పించలేదు.

అసలు ఆ రచన అమలుడు, చారులత వ్రాసినట్టు! అమలుడు రచయిత, ఆమె పాఠకురాలు! అలా గోప్యంగా వుంటమే ఆమెకు ఆనందం. ఆ రచనలు అందంగా చదవటం, చాలమంది ప్రశంసించటమంటే. ఎందుకు యింతగా తాను దుఃఖపడుతున్నదీ ఆమెకు తిన్నగా బోధపడలేదు. కాని ఒక్కే ఒక పాఠకునిలో రచయితకు [illegible] అతను తన రచనలు పత్రికలకు పంపి, ప్రశంసలు కొంటూ అందుకున్నాడు.

మధ్యమధ్య భక్తుల ఉత్తరాలు కూడా వస్తున్నవి. అతను వాటిని వదినకు చూపేవాడు. అందుకు చారులతకు ఆనందమూ కలిగేది, దుఃఖమూ కలిగేది! ఇప్పుడు అమలుని రచనావ్యాసంగానికి, ఆమె ప్రోత్సాహము, ప్రోద్బలముతో పూర్వంమాదిరి

అవసరం లేకుండాపోయింది. అతనికి అప్పుడప్పుడు పూరా పేరు లేని యువకులవద్దనుంచి ఉత్తరాలుకూడా వస్తున్నవి. అందుకు అతనిని పరిహాసాధికమూ చేసి. కాని మనసుకు హాయిగా వుండేది కాదు! ఆకస్మికంగా, బంధు-మిత్రుల్ని వారిద్దరికమింటే కవాటాలు తెరుచుకుని, దేశంలోని పాఠకగణము వారిని పురిముక్త్యాకు రావటమేమిటి!

భూపతిబాబు ఒకనాడు తీరికగావుండి, మాటల సందర్భంలో— "మన అమలుడు చక్కగా వ్రాస్తాడని నాకు ఇన్నాళ్ళనుంచి తెలియనే తెలియదు!" అన్నాడు.

భూపతిబాబు ప్రశంసించినందుకు ఆమెకు సంతోషంగా వుంది. అయితే, భూపతిబాబు ఆశ్చర్యపోయాడు! కాని అమలునికీ, మిగతా వారికీ భేదముందని భర్త గ్రహించినందుకు ఆమె ఎంతో అభినందించింది. "నేను అమలుణ్ణి ఇంతకన్నా మొదట్లో, అతనంటే దేనికి చూస్తున్నానో మీరెవరూ ఈనాటికి గ్రహించగలిగారు. కాని నాకు ఎప్పుడో అతని విలువ తెలుసు! అతను తృణీకరించవలసినవ్యక్తి కాదు!" అని ఆమె ఆంతర్యం!

"మీరు అతని రచనలు చదివారా?"

"ఆఁ లేదు. సరిగా చదవలేదు. ఐనా ఇవన్నీ చదవటానికి నాకు తీరుబాటు యేది? కాని మన నిశికాంతుడు చదివి, బాగా మెచ్చుకున్నాడు. అతనికి సాహిత్యంలో మంచి ప్రవేశం వుంది."

భూపతి మనసులో అమలునిగురించి ఆదరభావం ఏర్పడాలని ఆమె హృదయపూర్వకంగా వాంఛిస్తూవుంది.

౩

ఉమాపతి పత్రిక చందాదారులకు ప్రతిసంవత్సరమూ నడుమనడుమ ప్రత్యేకకానుకలు సమర్పిస్తూ వుండాలని భూపతి బాబుకు నచ్చజెప్తున్నాడు. కాని భూపతిబాబుకు అందువల్ల నష్టానికిబదులు, లాభం ఎలావస్తుందో అంతుబట్టటంలేదు.

చారులత ఒకసారి గదిలోకివచ్చి, ఉమాపతినిచూసి వెళ్ళిపోయింది. కొంచెంసేపు అటూ యిటూ తిరిగి మళ్ళీ గదిలో అడుగుపెట్టింది. ఇద్దరూ యేదో ఎకౌంట్సును గురించి చర్చిస్తున్నారు. వుమాపతి ఆమె వేగిరపాటుచూసి, యేదో సాకుచెప్పి బయటికి వెళ్ళిపోయాడు. భూపతి ఎకౌంట్సుతో తిల బద్దలుచేసుకుంటున్నాడు.

ఆమె లోపలికివచ్చి "ఇంకా మీపని తెమిలినట్టులేదే! రాత్రింబవళ్ళూ ఆ పత్రిక పెట్టుకుని ఎలా పొద్దుపుచ్చుతారా అని ఆలోచిస్తుంటాను!" అంది.

భూపతి ఫైల్సుపక్కకునెట్టి, మందహాసంచేశాడు, "నిజానికి, చారులత విషయం శ్రద్ధతీసుకోటానికి తీరుబాటే లేకుండా వుంది; ఇది చాలఘోరం! పాపం ఎలా పొద్దుపోతుందో!" అనుకున్నాడు మనసులో.

భూపతి స్నేహపూరిత స్వరంతో – "ఇవాళ స్కూలుకు ఆటవిడుపులా వుందే! మాష్టరుగారు యెటో వుడాయించారు. మీ స్కూలు నియమాలన్నీ విడ్డూరంగా వున్నవి. శిష్యు

కాలు పలకా పుస్తకం చేతబట్టుకుని సిద్ధంగా వుంది, కాని పంతులుగారు వస్తారేమో. అసలు ఇప్పుడు వేళకు వచ్చి, పాఠాలు చెప్పటం లేదా?" అన్నాడు.

"నా చదువుతో, అతని సమయం వ్యర్థం చెయ్యటం న్యాయమా! మీరు ఉద్యోగులని యేదో మామూలు ట్యూషను అనుకున్నాను!"

అతను చాప సమయం పట్టుకుని దగ్గరకు తీస్తూ – "సిది మామూలు ట్యూషనా యేమిటి! నేనుగనుక సీతాదేవి వదిన కు పాఠాలు చెప్పటమయితే–" అన్నాడు.

"ఆహా! చెప్పవలసిన దేముంది! భర్త అయితేనే, ఇంత సొంపుగా ఉంది. ఇకను:" ——

భూపతి కొంచెం బాధపడ్డాడు. "సరే, నేనే రేపటి నుంచి చెపుతాను. యేం చదువుతున్నావో చూద్దాము పుస్తకాలు పట్టుకురా!"

"చాల్లెండి, మీరు చెప్పినట్టే వుంది! కానీపు ఆ ఎకౌంట్సు దూరంగా పెట్టి, నా మాట ఒకటి ఆలకిస్తారా?"

"తప్పకుండా! ఇప్పుడు నా మనస్సును నీ ఇష్టమొచ్చిన వేపు మళ్ళించవచ్చు!"

"మంచిది, ఇదిగో ఈ రచన చదవండి. గొప్పగా వ్రాశాడు. ఈ రచన చదివి, నవగోపాలబాబు అమలుని రస్కిన్‌తో పోల్చాడని సంపాదకులు వ్రాశారు."

భూపతి సంకోచిస్తూ పత్రిక తీసుకుని చూశాడు – ఆ లేఖ పేరు 'ఆషాఢ చంద్రుడు'

భూపతిబాబు క్రితం రెండువారాల నుంచీ ప్రభుత్వ బడ్జెటు సమర్పించటానికి అంకెలతో యుద్ధం చేస్తున్నాడు. ఆ అంకెలు యొక్క పాదాలున్న కీటకాల మాదిరి, అతని మస్తిష్కరంధ్రాల్లో తిరుగుతూన్నవి. అలాంటప్పుడు ఆమె మాతృ భాషలో వ్రాసిన 'ఆషాఢచంద్రుడు' మొదటినుంచి చివర దాకా చదవటానికి మనస్కరించలేదు. రచన కూడా చిన్నది కాదు.

"ఆషాఢమాస చంద్రుడా! నీవు రాత్రిళ్ళు మేఘాల్లో దోబూచులాడుతావు దేనికి? స్వర్గలోకంనుంచి యేమైనా దొంగిలించి వచ్చావా? లేక నీ కళంకం కప్పిపుచ్చుకోటానికి యెక్కడా తావుదొరకలేదా? ఫాల్గుణమాసంలో ఆకాశాన మబ్బుపొడ కానరానప్పుడు, ప్రపంచం సమస్తాన నిర్లజ్జని మాదిరి నిర్మలాకాశంలో నీ రూపం ప్రదర్శించుకున్నావు. దశదిశలా వ్యాపించిన నీ ఆ చిరునవ్వు నిండు శిశుస్వప్నం మాదిరి, ప్రియురాలి స్మృతిలా, సుకేశ్వరికచీదేవి కుంతలాల్లోని ముత్యాలహారం మాదిరి —" రచన ఇలా సాగిపోయింది.

భూపతి తల గోక్కుంటూ "చక్కగా వ్రాశావు కాని నాకు యిస్తావు దేనికి? ఈ కవిత్వ విషయాలు నాకు అర్థంకావు" అన్నాడు.

ఆమె చిన్నబుచ్చుకుని భర్త చేతిలోనుంచి పత్రిక లాక్కొని "అయితే, మీకు అర్థమయే దేమిటి?" అంది.

"నేను యిహలోక జీవిని. మహా అయితే మానవుణ్ణే అర్థం చేసుకోగలను."

"సాహిత్యంలో మానవునిగురించి వ్రాయరా!"

"కల్పన జాస్తి! అదికాక, మానవుడు కళ్ళముందు కనిపిస్తూంటే, అతన్ని కాల్పనిక జగత్తులో అన్వేషించినందు వల్ల ప్రయోజన మేమిటి?" అని భూపతిబాబు ఆమె చుబుకం పట్టుకుని చెప్పసాగాడు. "నిన్ను అర్థం చేసుకోటానికి 'మేఘ నాథవధ' 'చండీదాసు' చదవాలసిన పనేముంది?"

భూపతిబాబు తనకు కావ్యాలు అర్థం కానందుకు అభిమానపడేవాడు! కాని చదవకుండానే అమలు రచనలంటే మహాశ్రద్ధ! చెప్పవలసింది యేమీ లేనప్పటికీ, కల్పించి ఇన్ని విషయాలు ఎలా వ్రాస్తాను? యిది నావల్ల మాత్రంకాదు. అమలువిలో యింత శక్తిసామర్థ్యాలున్నవని యెవరికి తెలుసు అని భూపతిబాబు అబ్బురపోయేవాడు.

భూపతిబాబు తాను రసజ్ఞుణ్ణని అంగీకరించేవాడు కాదు. కాని సాహితీ ప్రియుడని మాత్రం చెప్పవచ్చు. యెవరైనా రచయితలు వచ్చి తన సహాయాన్ని అర్థిస్తే పుస్తక ప్రచురణకు వుదారంగా ఇచ్చి పంపేవాడు. 'యీ కృతి నా పేర అంకితం ఇవ్వవద్దు' అని చెప్పటం మరచేవాడు కాదు. వార పత్రికలు, మాసపత్రికలు, చిన్నవి, పెద్దవి, మంచివి, చెడ్డవి అన్ని పుస్తకాలు కొనేవాడు. ఆ ప్రస్తావన వచ్చినప్పుడు "నేనేమో చదవను, ఆ మీదట కొనకుండా పాపం మూట కట్టుకుంటే, దానికి ప్రాయశ్చిత్తంకూడా లేదు" అంటుండే వాడు. చదవక పోబట్టే, అతనికి చెడు పుస్తకాలన్నా ద్వేషం లేదు. అతని లైబ్రరీలో మాతృభాషలో ఇన్ని గ్రంథాలు వుండటానికి ముఖ్య కారణం ఇదే.

అమలుడు భూపతికి ఇంగ్లీషు ప్రూఫులు చూడటంలో చేదోడుగా వుండేవాడు. అతను యేదో ప్రాశ్నపత్రి అర్థంకాక ఒక బండిల్ చేతపట్టుకు వచ్చాడు. భూపతి మందహాసం చేస్తూ "అమల్, నీవు 'ఆషాఢ చంద్రుడి' మీదో, భాద్రపదంలో ముగ్గిన తాళవృక్షం మీదో, నీ యిష్టమొచ్చినట్టు వ్రాసుకో! నాకేమీ అభ్యంతరం లేదు. నేను ఒకరిస్వేచ్ఛకు అడ్డురాను. కాని నా స్వేచ్ఛకు ఆటంకం కలిగించట మేమిటి? మీ వదిన నీ రచనలు చదివేదాకా, నా ఊపిరి తీస్తూవుంది. యిదేం న్యాయమంటా" అన్నాడు.

అమలుడు నవ్వి—"ఇదేమిటి వదినా, నా రచనలవల్ల అన్నాయికి నీ మూలాన అన్యాయం జరుగుతుందనుకుంటే, అసలు కలం పట్టుకునేవాణ్ణేకాదు!" అన్నాడు.

సాహిత్య రసాస్వాదనకు విముఖుడైన భూపతివద్ద, కరుణా రసపూరితమైన తన రచనలకు నిరాదరం జరిగినందుకు, అతనికి చారుమీద కోపం వచ్చింది. ఆమె వెంటనే ఇది గ్రహించి బాధపడింది. విషయం మార్చాలనే ఉద్దేశంతో—"మీరు తమ్ముడి పెళ్ళి ఎందుకు చేయరూ, అప్పుడు మీకు ఈ రచన బెడదతప్పిపోతుంది" అంది.

"నేటి యువకులు మనలాంటి మూర్ఖులు కారు. వారి కవిత్వమంతా రచనలతో నేసరి, పనిపాటల్లో మంచిరోగ్యాలు! మరిదిని నీవు శాస్త్రం పెళ్ళికి ఏమి వొప్పించగలిగావు?"

చారు వెళ్ళినాక, భూపతి—"అమల్, నాకు ఈ పత్రిక గొడవతో కాలంసరిపోతూంది, పాపం చారు చాల యేకాకిగా వుంటూంది. చేతిలో ఏమీ పనిలేక నడుమ నడుమ నా గది

లో వచ్చి తొంగిచూసిపోతుంది. నీవు చాప దృష్టిని చదువు సంధ్యలకేసి మలిపితే, బాగుంటుంది. అప్పుడప్పుడు ఇంగ్లీషు కావ్యాలు అనువాదంచేసి, వినిపిస్తుంటే, పొద్దూపోతుంది, ప్రయోజనమూ వుంటుంది. చాయకు సాహిత్యమంటే అభిరుచి ఉంది". అని చెప్పాడు అతనితో.

"ఆమాట నిజమే! వదిన కొన్నాళ్ళు శ్రద్ధగా చదివితే చక్కగా వ్రాయగలదని నా నమ్మకం."

భూపతి నవ్వి—"నేను అంతగా అనుకోవటం లేదు. కాని నాకంటె ఆమె సాహిత్య విమర్శ చక్కగా చేయగలదని గట్టిగా చెప్పగలను". అన్నాడు.

"ఆమెలో చక్కని కల్పనాశక్తి వుంది. సాధారణంగా స్త్రీలలో కల్పనాశక్తి చాలా అరుదు!"

"పురుషుల్లోనూ అరుదని చెప్పటానికి నేనే తార్కాణం! సరే, నీవు మీ వదినను వొకవ్యక్తిని చేయగలిగితే, నీకు మంచి బహుమతి యిస్తాను!"

"అదేమిటో చెప్పు అన్నాయి?"

"మీ వదినకు తోడు మరదలిని వెదకి పట్టుకువస్తాను."

అనిలుడు నవ్వి - "అయితే ఆమెనుకూడా వొక వ్యక్తిని చేయాలసివస్తుంది. ఇక నా జీవితమంతా యిందుకే సరిపోతుంది!" అన్నాడు.

సోదరులిద్దరూ ఆధునికులు కావటంవల్ల, వారి సంభాషణలో సంకోచానికి తావులేకపోయింది.

# 4

అమలుడు పాఠక సమాజంలో పేరు ప్రతిష్ఠలు పొంది, పూర్వంకంటె ఇప్పుడు తలయెత్తుకుని తిరిగేస్థితికి రాగలిగాడు. పూర్వం అతను స్టూడెంటు మాదిరివుండేవాడు. కాని ప్రస్తుతం సమాజంలో వొక గణ్యతకు వచ్చినవ్యక్తి మాదిరి గోచరిస్తున్నాడు. కదాచిత్తుగా సాహిత్య సభల్లో లేఖలు చదువుతున్నాడు. సంపాదకులు, సంపాదకుల దూతలు అతనివద్దకువచ్చి, సాదరంగా ఆహ్వానించి, తేనీరుతో, విందులతో మర్యాద చేస్తున్నారు. ప్రజలు అతన్ని అనేక కమిటీలలో సభ్యుడిగా వుండమనీ, సభలకు అధ్యక్షత వహించమనీ బలవంతం చేస్తున్నారు. ఇంట్లోని దాసదాసీలు, ఆత్మీయులు ఇత్యాదులందృష్టిలో అతనికి ఆదరం పెరిగింది. కాని మందాకిని యింతవరకూ అతనికేమీ ప్రత్యేకతయివ్వలేదు. అమలుడు, చారులత-వీరిద్దరి హాస్యాలాపాలు, విమర్శలు కుట్రచేష్టలుగా యెంచి వుపేక్షాదృష్టితో చూసేది; ఇంట్లో తననసలేమిటో చూసుకునేది. వాళ్ళిద్దరి కంటె తను గొప్ప అనీ, కుటుంబానికి తన అవసరం యెంతగానో వుందనీ భావించేది. అమలుడు నమిలే ఆకుబీడీలకు మితి వుండేదికాదు. అందరికీకావలసిన తాంబూలాలు చూసేబాధ్యత మందాకినిది! అందువల్ల తాంబూలానికి అయ్యే దుర్వ్యయానికి ఆమె చిరచిర లాడేది! అమలుడు, చారులత ఇద్దరూ కుట్రపన్ని, తాంబూలాలన్నీ కాజేసేవారు. రాను రాను వారికి

ఇదొక మనోవినోదంగా తయారయింది. కాని ఈ వినోదప్రియులా పరియాచకం మందాకినికి బొత్తిగా గిట్టేదికాదు!

అసలు వాస్తవమేమిటంటే, ఆశ్రితులు ఒకర్నొకరు ప్రసన్నదృష్టితో చూడలేరు! అమలుని కోసం తాను శ్రమపడటం, మందాకిని అవమానంగా యెంచేది. చాడు అమలుణ్ణి వెనకవేసుకు వచ్చేది. అందువల్ల ఆమె పెదవి విప్పి యేమీ అనలేకపోయేది. కాని అతన్ని వుపేక్షించటానికి యెప్పుడూ ప్రయత్నిస్తుండేది. అవకాశం దొరకగానే చాటుగా దాసదాసీలవద్ద అతనిని నిందించటం మరిచేదికాదు. వాళ్ళుకూడా ఆమెమాటలకు వంత పలికేవాళ్ళు,

కాని అమలుని పేరు ప్రతిష్ఠలువిని, మందాకిని త్రుళ్ళి పడింది. అతను పూర్వపు వ్యక్తికాదు. ఇప్పుడు అతనిలోని సంకోచపూరితమైన వినయము అదృశ్యమయింది. యితరులను తృణీకరించే అధికారంకూడా అతనికి చెడిక్కినట్టుంది. ప్రపంచంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించి నిస్సంకోచంగా యెవరైతే తనను వ్యక్తీకరించుకోగలరో, యెవరైతే ఒక నిర్ణీతమైన అధికారాన్ని పొందుతారో అటువంటి సమర్థులు సహజంగానే స్త్రీల దృష్టిని ఆకర్షించగలరు! అందరూ అమలుణ్ణి శ్రద్ధాసక్తులతో చూడటం గమనించి తానూ అమలుని ఔన్నత్యం వంక కన్నెత్తిచూసింది. అతని లేమోవము మీద విరాజల్లే గర్వోజ్జ్వలమైన నూతనదీప్తి ఆమె నేత్రాల్లో ఒకవిధమైన మోహాన్ని సృష్టించింది. అప్పటినుంచీ ఆమె అతన్ని నూతన దృష్టి చూడసాగింది.

ఇప్పుడు తాంబూలాలు దొంగిలించ నక్కరలేకుండా పోయింది. అతనికి పేరు ప్రఖ్యాతులు రావటంవల్ల వాళ్ళిద్దరి వినోద ప్రియత్వానికి అంతరాయం కలగటం చారులతకు తీరని నష్టమే! ఇప్పుడు అడగకుండానే అతనివద్దకు ఆకులు వక్కలు వస్తున్నవి. కొనక తరుగులేదు. అదీగాక వారిద్దరి సుసంఘటిత దళానికి 'మందాకినిని నేర్పుగా దూరంగావుంచే' ఆనందానికి కూడా విఘ్నంకలిగే పరిస్థితి యేర్పడింది. ఇకను ఆమెను దూరంగా వుంచటం కష్టమయింది. అమలుడు ఒక్క చారునే స్నేహితురాలుగా, విజ్ఞురాలిగా యెంచటం మందాకినికి కంటగింపుగా వుంది. పూర్వం తనను వుపేక్షించినందుకు, యిప్పుడు ప్రతిక్రియ చేయాలనుకుంది. తత్ఫలితంగా అమలు, చారు ఒకచోట చేరగానే మందాకిని ప్రతిబింబం పడి, 'గ్రహణం' తలుపుకు వచ్చేది! ఆకస్మికంగా మందాకినిలో వచ్చిన ఈ మార్పువల్ల వారి హాస్యాలాపలకు అవకాశం లభించటమే దుర్లభమయింది.

మందాకిని ఇలా పిలవని పేరంటానికి పరుగెత్తుకు పోవటం, చారుకు ఎంత అయిష్టంగా ఉందో, అమలునికి అంత అయిష్టత లేనట్టుంది! విముఖురాలైన వొక స్త్రీ మనస్సు, క్రమంగా తనకేసి మొగ్గు చూపటం గ్రహించి, అతను లోలోపల ఒక విధమైన ఆవేశం పొందుతున్నాడు. కాని చారు ఆమెను అంతదూరాన చూడగానే, తీవ్రమృదుస్వరంతో—"అదిగో, వస్తోంది!" అనేది. "వచ్చిందీ వేధించటానికి!" అని మాట కలిపేవాడు అమలుడు. ప్రపంచంలో అందరిపట్ల విరక్తి వెలిబుచ్చటమే, యించుమించు వారికి అలవాటైపోయింది; అతను

ఒక్కమారుగా ఈ అలవాటు ఎలా మానగలడు! తీరా మందాకిని దగ్గరకు రాగానే, తెచ్చిపెట్టుకున్న సౌజన్యంతో —"విశేషాలేమిటి. ఈవాళ ఎవరూ ఆను బీడీలు కాజేసినట్టు లేదే!" అనేవాడు! మందాకిని—"అడిగీ అడగకముందే వస్తుంటే, కాజేయవలసిన పని ఏముంది?" అని జవాబిచ్చేది. "అయినా, కాజేయటంలో ఉండేఆనందం, అడిగితీసుకోటంలో ఎందుకుంటుంది?" అనేవాడు. "మీరు ఏదో చదువుతూ, మధ్యలో ఆపారేం? నేనూ వింటాను". అనేది మందాకిని!

అంతకుపూర్వం మందాకినికి అతని రచనలు వినాలని ఆసక్తి ఎన్నడూ కలగలేదు. కాని కాలం బలీయమైనది!

అరసికులాలు మందాకినివద్ద అమలుడు ఏదైనా చదవటం చారులతకు ఇష్టంలేదు. మందాకినికూడా తన రచనలు వినాలని అమలుని కోరిక! "అమలుడు 'కమలాకాంతుని ఆఫీసు' మీద సమీక్ష వ్రాశాడు అది నీకేం తెలుస్తుంది?" అంది చారు.

"నేను మూర్ఖురాలినే కావచ్చు— ఐతే మాత్రం బొత్తిగా తెలియనంటావా?" అంది మందాకిని.

అప్పుడు అమలునికి మరోవిషయం తలపుకు వచ్చింది. ఒకనాడు చారులత, మందాకిని ఇద్దరూ పేకాడుతున్నారు. అమలుడు తన రచన చేతపట్టుకుని, చారుకు వినిపించాలని తహతహ లాడుతూ అక్కడికి వచ్చాడు. ఎంతకూ ఆట ముగియనందుకు అతను లోలోపల విసుక్కుంటున్నాడు. అతను చివరకు—"అయితే మీరు ఆడుకోండి వదినా, నేను అఖిలబాబు వద్దకువెళ్ళి విన్పిస్తాను." అన్నాడు. చారు అతని

వుత్తరీయం పట్టుకుని—"ఎక్కడికి వెళుతావు, కొంచెం కూర్చోరాదూ!" అని, త్వరగా తనే ఓడిపోయి, ఆట ముగించింది. చారు సౌజన్యం వెలిబుచ్చుతూ—"నీవుకూడా విన రాను వదినా!" అంది. "కాదమ్మా, నాకు నిద్రముంచు కొస్తోంది. వింటేమాత్రం నాకేం తెలుస్తుంది చట్టుబండలు?" అని, మందాకిని అంత త్వరగా పేకాట ఎత్తివేసినందుకు కోప గించుకుని, లేచి వెళ్ళిపోయింది.

ఇవాళ ఆ మందాకినే 'కమలాకాంతుని' సమీక్ష విన టానికి ఉవ్విళ్ళూరుతూంది! "నీవు వింటానంటే, నాకు మహా సంతోషం!" అన్నాడు అమలుడు మందాకినితో! అమలుడు పేజీలు సర్దుకుని చదవటానికి ఉపక్రమించబోయాడు. అంతలో చారు– "మరిదీ, గ్రంథాలయంనుంచి పాత మాసపత్రికలు తెచ్చియిస్తానన్నావుగదూ!" అంది.

"ఇవాళ కాదులే!"

"ఇవాళే తెస్తానన్నావు. మరిచిపోయినట్టుంది!"

"ఎందుకు మరిచిపోతాను? నువేకదా కేవు—"

చారు మధ్యలోనే అందుకుని– "సరే, లేకపోతే మానె! మీరు చదువుకోండి. నేను ఎవరినైనా గ్రంథాలయానికి పంపు తాను" అని, లేచి వెళ్ళింది.

అమలుడు ఏదో బెడదతప్పదనుకున్నాడు. మందాకిని విషయం గ్రహించి, చారుపట్ల ఆమెమనస్సు విషాక్తమయింది. చారు వెళ్ళిపోయినాక, అక్కడవుండాలా, వెళ్ళాలా అని అమ లుడు సందిగ్ధావస్థలోపడ్డాడు. అంతలో మందాకిని ముసిముసి నవ్వులునవ్వుతూ– "వెళ్ళు. వదిన అలకతీర్చు బాబూ! ఆమెకు

కోపంవచ్చింది. నీ రచనలు వినిపించి, వృథాగా దేనికిచిక్కుల్లో పడతావు?” అంది.

ఇంక అక్కడనుంచి లేవటం, అతనికి చాల కష్టమైంది. బాబుమీద కొంచెం విసుక్కుని– “నా కేమిచిక్కు!” అని, చదవనారంభించాడు. మందాకిని రెండుచేతులతో ఆ వ్రాత ప్రతినిమూసి– “వద్దుబాబూ, వద్దు!” అంటూ, పొర్లివచ్చే కన్నీరు ఆపుకుని వెళ్ళిపోయింది.

## 5

చారు బంధువులయింటికి విందుకువెళ్ళింది. మందాకిని గదిలో కూర్చుని, జడ అల్లుకుంటూవుంది. అంతలో ‘వదినా!’ అని పిలుస్తూ, అమలుడు లోనికివచ్చాడు. చారు విందుకు వెళ్ళటం అమలుడికి తెలుసని ఆమెకు గట్టినమ్మకం! ఆమెనవ్వి– “రా బాబూ. నీవు వచ్చింది ఒకరికోసమైతే, మరొకరు తటస్థపడ్డారు! నీ అదృష్టమే అలావుంది!” అంది.

“గాలివస్తే, కుడివేపువచ్చినా, ఎడమవేపునుంచొచ్చినా అని భేదమేముంటుంది? రెండూ దానిదృష్టికి సమానమే!” అని, అక్కడకూర్చుని– “మీ వూరునుగురించి చెప్పరాదూ, నాకు వినాలనివుంది!” అన్నాడు కొంచెంఆగి.

అమలుడు కథావస్తువుకోసం అన్నివిషయాలూ శ్రద్ధగా ఆలకించేవాడు. అందువల్ల మందాకినిని ఇప్పుడు ఉపేక్షించటం లేదు. మందాకిని మనస్తత్వము, ఆమెజీవితం అతనికి శ్రద్ధాస్పదమైనవి. ఆమె ఎక్కడపుట్టింది, ఎక్కడ పెరిగింది, ఎప్పుడు వివాహమయింది ఇత్యాది విషయాలన్నీ అతను గుచ్చిగుచ్చి

అడిగి తెలుసుకున్నాడు. ఆమె జీవితవృత్తాంతాన్ని గురించి ఇంత కుతూహలం ఎందుకో అతను చెప్పలేడు; మందాకినికూడా మైమరచి ఆనందంతో స్వవిషయాలు చెప్పుకుపోతూవుంది. మధ్యమధ్య "నేనేం వాగుతున్నానో, నాకే తెలియటంలేదు" అనేది కాని మానలేదు చెప్పటం! అమలుడుకూడా ఆమెను ప్రోత్సహిస్తూ — "కాదు, నాకు వినముచ్చటగావుంది చెప్పు!" అనేవాడు.

మందాకిని తండ్రివద్ద వ్రాతగుమాస్తా ఉన్నాడు. అతను తన రెండో భార్యతో కీచులాడి, నిరశనవ్రతం ప్రారంభించేవాడు. చివరకు ఆకలిబాధకు తాళలేక, యెలా వాళ్ళ ఇంటికి చాటుగా వచ్చిందీ, అతని భార్య అకస్మాత్తుగా వచ్చి యెలా అతన్ని పట్టుకున్నదీ వర్ణిస్తూవుంది. అమలుడు యేకాగ్రచిత్తంతో వింటూ, కౌతుకంతో నవ్వుకుంటున్నాడు. అంతలో చారువచ్చింది. కథాప్రవాహానికి భంగం కలిగింది. తన రాకవల్ల రక్తికట్టిన సభ, తేలిపోయిందని చారుకు స్పష్టంగా బోధపడింది.

"వదినా, చాలా త్వరగా వచ్చావే!"

"ఊఁ. త్వరగానే వచ్చాను" అంటూ చారు వెళ్ళబోయింది. "నీవు వచ్చేటప్పటికి యేవేళ అవుతుందోనని కున్నాను రక్షించావు! మన్మథదత్తు 'సంధ్యావిహంగం' నీకు వినిపిద్దామని కొనుక్కువచ్చాను." అని చెప్పాడు అమలుడు.

"ఇప్పుడు కాదులే, నాకు పనివుంది!

"పనివుంటే నన్ను పురమాయించు!"

అమలుడు ఇవాళపుస్తకం తెస్తాడని చారుకు తెలుసు. అతని మనసులో యీర్ష్యాగ్నిని రేకెత్తించటానికి ఆమె వాళ

పథకం సిద్ధంచేసుకుంది - మన్మథదత్తుని బాగా ఆకాశానికి యెత్తితే, అమలుడు వెక్కిరింపుగా చదివి, మన్మథ దత్తుని హేళన చేస్తాడు! చారు ఇవన్నీ వూహించుకుని, ఆహ్వాన కర్తలు యెంత బలవంతం చేసినా వొంట్లో బాగా లేదని సాకు చెప్పి, పడుతూ లేస్తూ త్వరగా ఇంటికి వచ్చింది. కాని మిగలా వచ్చినాక, అక్కడే హాయిగా గడిచిపోయేది, రావటం అన్యాయమనుకుంది. మందాకిని లేకి మనిషి! గదిలో వొంటరిగా కూర్చుని, అమలునితో ఆ వకవక లేమిటి? నలుగురూ చూస్తే, యేమనుకుంటారు? కాని ఈ విషయాన్ని పురస్కరించుకుని ఆమెను మందలించేది యెలా? ఆమెకూడా తనను అలానే తప్పుపడితే? కాని ఆమె విషయం, తన విషయం వొకటి యెలా అవుతుంది? తాను అమలునితో సాహిత్య చర్చ చేస్తుంది. అతన్ని ప్రోత్సహిస్తుంది! కాని మందాకినికి అలాంటి ఉద్దేశమే ఉంటానికి వీల్లేదు. 'మందాకిని నిస్సందేహంగా ఈ సరళ హృదయుణ్ణి వశంచేసుకోటానికి వలవన్నుతూ ఉంది. ఈ భయంకర విపత్తునుంచి అమలుని రక్షించటం తన విధి! కాని అతనికి యీమాయావిని ఆంతర్యం విప్పిచెప్పేది యెలా? విప్పిచెప్పినందువల్ల లోభం అధికమవుతుందేమో! పాపంఅన్నాయి, రాత్రింబవళ్లు పత్రికనుగురించి సతమతమవుతున్నాడు. మందాకిని యేమో ఇంట్లో మూలన కూర్చుని అమలుని ఆకర్షించడానికి యెత్తులు వేస్తూవుంది! అన్నాయి నిశ్చింతగా ఉన్నాడు. మందాకిని మీద అగాధమైన నమ్మిక ఆయనకి. ఇదంతా కళ్ళారాచూస్తూ, తాను స్థిమితంగా యెలా వుంటుంది? యిది చాల ఘోరం! కాని అమలుడు యిదివరకు

యిటువంటి వ్యక్తి కాదు. కాస్త వ్రాయటం మొదలుపెట్టి అతని పేరు నలుగురికీ తెలియగానే యీ అనర్థం సంభవించింది! అమలుడు వ్రాయటానికి మూలకారణం తానేగదా! మరి తాను అతన్ని ఏ దుర్మార్గాన ప్రోత్సహించిందో! ఇంకా తనకు అతనిమీద అధికారం యేముంది? అతను యిప్పుడు పది మంది ఆదరసత్కారాలు రుచిచూసిన తర్వాత, ఒకరు తగ్గి నందువల్ల మునిగిపోయేదేమీ వుండదు.

అమలుడు తన గుప్పిట్లోనుంచి బయటపడి, పదిమంది చేతుల్లోపడి, పెద్ద జనంలో చిక్కుకున్నాడని చారు గ్రహించింది. యిప్పుడు తనకు సమానమైన స్థానం యివ్వటంలేదు. ఈ వాళ తనను మించిపోయాడు. అతను రచయిత; తాను పాఠకురాలు; దీనికి ప్రతిక్రియ చేసితీరాలి! యిలా ఆలోచిస్తూ ఆమె హృదయం అస్ఫుటస్వరంతో "అమలుడు అన్యాయకుడు, మందాకిని మాయావిని; అన్నాయి దురదృష్టవంతుడు" అని పలికినట్టుంది.

## 6

ఆది ఆషాఢమాసం. ఆకాశంలో తొలకరి మేఘాలు కావుకు కమ్ముతున్నవి. పగలే గదిలో చీకట్లు అలుముకోటం వల్ల చారు కిటికీవద్ద తలవంచుకు కూర్చుని యేదో వ్రాసుకుంటూ వుంది. అమలు పిల్లిఅడుగులు వేసుకుంటూ ఎప్పుడు వచ్చి నిలబడ్డాడో ఆమెకు తెలియదు. మేఘాల స్నిగ్ధకాంతిలో చారు వ్రాస్తూవుంటే అతను చదువుకు పోతున్నాడు. ఆమె

రెండేట అమలుని రచనలు ఒకటి రెండు పడివున్నవి. అదే ఆమెకు ఆదర్శం!

"వ్రాయటం నా వల్ల కానిదని అనేదానివే!" ఆకస్మికంగా అమలుని కంఠస్వరం విని చారు త్రుళ్ళిపడింది. చప్పున వ్రాసేకాగితాలు దాచి "ఘోరం, అన్యాయం" అంది.

"ఇందులో అన్యాయం యేముంది?"

"చాటుగా దేనికి చదవాలి?"

"ప్రకాశ్యంగా వీలులేక!"

చారు తాను వ్రాసింది చింపి వేయబోయింది కాని అతను ఆ కాగితాలు ఆమె చేతిలోనుంచి లాక్కున్నాడు.

"నీవు యిది చదివావా, జీవితాంతం నీతో పలకను!"

"నన్ను నిషేధించావ్రూ, నేనూ జీవితాంతం పలకను!"

"చదివితే నామీద వొట్టే మరి!"

చివరికి ఆమే పరాజయం స్వీకరించక తప్పలేదు. కారణం అతనికి తన రచన చూపించాలని ఆమె ప్రాణం తహతహ లాడుతూవుంది. కాని వల్లమాలినసిగ్గుకు గురికావలసివస్తుందని ఆమెకుతోచలేదు. అమలు ఎంతో బ్రతిమాలి, ఆమెవ్రాతాన్ని అంగీకారంగా తీసుకుని, చదవ నారంభించగానే, ఆమెకు ముచ్చెమటలు పోసినవి. 'నేను తాంబూలం తెస్తా' నంటూ పక్కగదిలోకి వెళ్ళిపోయింది.

అమలు చదవటంముగించి, చారువద్దకు వెళ్ళి– "వదినా, చాల చక్కగా వ్రాశావు!" అని చెప్పాడు.

చారు ఆకులమీద కాచుచల్లటం మరిచిపోయింది. "పరియాచకాలకేమిగాని నా కాపీ నాకు ఇవ్వు!"

"అసంభవం! సాఫు వ్రాసి, పత్రికకు పంపుతాను."

"ఆc. పంపిస్తావు చూస్తానుగా!"

చారు కాపీ ఇవ్వమని అమలుని పీడించసాగింది. కాని అమలుడు సమ్మతించలేదు. అతను పదేపదే "ఏదైనా పత్రికకు పంపించ దగిన రచన" అని చెప్పగా, ఆమె పూర్తిగా నిరాశ చేసుకుని—"నీతో ఎవరు నెగ్గుతారు! వట్టి మొండివి! అనుకున్నది పూర్తికానిదే ఊరుకోవు!" అంది.

"అన్నాయికి ఒకసారి చూపించాలి."

చారు ఆమాట చెవినిపడగానే అకులుమడిచి యివ్వటం మరిచిపోయి, లేచి నిలబడి, ఆ కాపీ లాక్కోనటానికి ప్రయత్నిస్తూ—"కాదు, వారికి చూపించటానికి నేను ఒప్పుకోను. వారితో మాటమాత్రంగా అన్నా, నేను అట్లా కలంపట్టు మనేదిలేదు!" నిష్కర్షగా చెప్పింది.

"వదినా, నీవు చాల పొరపడుతున్నావు. అన్నాయి పైకి ఏమన్నప్పటికీ, ఈ రచన చూసి చాలా సంతోషిస్తారు!"

"వారేమీ సంతోషించనక్కరలేదులే!"

చారు తన రచనలతో అమలుణ్ణి ఆశ్చర్యచకితుణ్ణి చేయాలని పంతం పట్టింది. మందాకినికి, తనకు ఎంత తారతమ్యముందో నిరూపిస్తేగాని ఆమె మనసుకు శాంతి వుండదు! కొన్నాళ్ళనుంచి ఎన్నో రచనలు, ప్రారంభించి, నచ్చక అన్నీ చింపివేసింది. కారణం, తన వ్రాతలన్నీ అమలుని రచనల మాదిరే వున్నవి. పోల్చి చూసుకుంటే, అతని రచనలకు కాపీలావున్న తావున చక్కగావుంది. మిగతాది మామూలుగా ఉంది. ఇవి అమలుని కంటపడితే నవ్వుకుంటాడు. ముక్కలు

ముక్కలు చేసి, పొరపాటున అతని చేతపడతవేమోనని కొలనులో పారవేసింది.

మొదట ఆమె 'శ్రావణమేఘాలు' అనే శీర్షికతో వ్రాసింది. భావాలనే అశ్రుజలంతో అభిషేకించి, చక్కని రచన పూర్తిచేశాననుకుంది. తర్వాత ఆమెకు హటాత్తుగా యిది అమలుని 'ఆషాఢమాస చంద్రుడు' అనే రచనకు మారురూపుగా తోచింది. "చందమామా, నీవు దొంగమాదిరి మేఘాలచాటున దాగుడుమూత లాడతావేం?" అని అమలుడు వ్రాశాడు. "కాదంబినీ, నీవు ఆకస్మికంగా వచ్చి, నీలాంచలం మరుగున చందమామను దొంగిలి, పారిపోతున్నావేం" అని తాను వ్రాసింది. ఆమె యెలానూ అమలుని శైలిని త్యజించలేక, విషయమే మార్చివేసింది. ఆమె అత్తవారిఊళ్ళో చెట్ల నీడలతో చీకట్లుకమ్మె చెరువు ఒడ్డున కాళికా దేవాలయం ఉంది. ఆ దేవాలయాన్ని గురించి, భయోత్పాతాలతో నిండిన కొన్ని బాల్యస్మృతులు ఆమె మనసులో మెదులుతున్నవి. ఆ దేవి మహాత్తును గురించి చిరకాలంనుంచి ఎన్నో కట్టుకథలు వాడుకలో ఉన్నవి. వాటిని ఆధారం చేసుకుని ముచ్చటగా వ్రాసింది. ప్రారంభంలో కొంతవరకు అమలుని శైలిని అనుకరించి శబ్దాడంబరం విశేషంగా వుంది కాని తర్వాతభాగం శిష్ట వ్యావహారిక భాషలో చక్కగా సాగిపోయింది.

అమలుడు పొంతంచదివి మనసులో "మొదట చక్కగా కుదిరింది కాని చివరిలో రచన తేలిపోయింది. అయినా,

తొలి ప్రయత్నంగా రచయిత్రిని అభినందించవచ్చు!" అను కున్నాడు.

"మరిదీ! మనిద్దరంకలసి మాసపత్రిక వెలువరిస్తే, ఎలా వుంటుంది?"

"కరెన్సీ లేనిదే పత్రిక యెలా నడుస్తుంది?"

"మనకు డబ్బుతో పనేముంది? వ్రాతపత్రిక నడుపు దాం! అందులో మనిద్దరి రచనలే వుంటవి. యెవరికీ చూప వద్దు. రెండు ప్రతులు చాలు. చెరొకటీ తీసుకుందాం!"

కొన్నాళ్ళక్రితం యీ ప్రస్తావన వచ్చివుంటే, అమలు ఆనందంతో వుక్కిరిబిక్కిరి అయేవాడు. కాని యిప్పుడు గోప్యంగా వుంచమంటే, అతనికి ఉత్సాహం సన్నగిలింది. తన రచనలు నలుగురూ చూస్తేకాని, తృప్తికలగటం లేదు. అయినా వెనకటి కీవి నిల్పుకోటానికి వుత్సాహం చూపాడు. "చాల బాగుంటుంది."

"కాని నీ వొక మాటయివ్వాలి. మనపత్రికకు మినహా వేటికీ నీ రచనలు ప్రచురణార్థం పంపకూడదు."

"అయితే, సంపాదకులు నన్ను చిత్రవధ చేయరూ?"

"ఇక నా చేతిలో నేనా మారణాస్త్రం లేకపోయింది!"

యిద్దరూ యేకాభిప్రాయానికి వచ్చారు. సంపాదకులు, రచయితలు, పాఠకులు ఆ యిద్దరే! వారితోనే ఒక కమిటీ యేర్పడింది.

"పత్రికకు 'చారుకళ' అని పేరుపెడదాము" అన్నాడు అమలు.

చారు తక్షణమే నిర్ణయించింది. "కాదు, 'అమల' అని నామకరణం చేద్దాం."

ఈ నూతన వ్యవస్థవల్ల, చారులత యీ మధ్యకలిగిన దుఃఖం మరచిపోయింది. ఇందులో ఇతరు లెవరికీ, ముఖ్యంగా మందాకినికి ప్రవేశంలేకుండా చేసినందుకు ఆమెకు చాలా సంతోషంగావుంది.

## 7

ఒకరోజు భూపతిబాబు చారుతో—"నీవు రచయిత్రివి అవుతావని ఒక్కనాటికీ అనుకోలేదు!" అన్నాడు. ఆమె మోము సిగ్గుతో ఆరక్తమయి, త్రుళ్ళిపడి—"నేనా, రచయిత్రినా! ఎవరన్నారు మీతో? శుద్ధ అబద్ధం!" అని చెప్పింది.

"వస్తువుతో సహా పట్టుపడ్డావు ప్రేయసీ! కావాలంటే ఋజువు ఇదిగో!" నని, 'సరోరుహ' పత్రిక తీసి చూపాడు. చారు గుప్తధనంగా యెంచి, యేరచనలను వ్రాత-పత్రికలో సంతరించుకుంటూ వుందో. అవే రచయితల పేరుతో సహా సరోరుహ మాసపత్రికలో ప్రచురింపబడినవి. తాను ఎంతో ముద్దుగా పంజరంలో పెంచుకునే పక్షులను తలుపుతీసి, బయటికి విడిచిపెట్టినట్టుగా ఉంది. భర్తముందర పట్టుపడిన సిగ్గు మరచిపోయి విశ్వాసఘాతకుడైన అమలునిమీద లోలోపల నిప్పులు కక్కుతూవుంది.

అంతలో—"ఇది చూడు"—అంటూ, భూపతిబాబు 'విశ్వబంధు' మాస పత్రిక తెచ్చి, ఆమె ముందర పడేశాడు. అందులో 'ఆధునిక గద్యశైలి'మీద వొక వ్యాసం ఉంది.

చాడు ఆ పత్రికను చేత్తో దూరంగా త్రోసివేస్తూ—"నేనేం చేసుకోను!" అంది. ఆమెకు అమలునిమీద ఎంతో కోపంగా వున్నదంటే, అభిమానంతో ఆమె తన మనస్సులో మరో విషయానికి తావు ఇవ్వలేకపోయింది.

"ఒకసారి చదివి చూడ"మని భూపతి బలవంతం చేశాడు.

ఆమెకు ఒకసారి పేజీలు తిరగవేయక తప్పలేదు. భావాడంబరంతో నిండిన ఆధునిక రచయిత గద్యశైలిని ఖండిస్తూ మన్మథదత్తు శైలిని హేళనచేశాడు. ఆ వ్యాసంలోనే నవీన రచయిత్రి శ్రీమతి చారులత భాషలోని సహజసారళ్య సరసత్వాలూ, చిత్రరచనా నైపుణిని, మన్మథదత్తు రచనలతో పోలుస్తూ, విశేషంగా ప్రశంసించారు. 'యిలాంటి శైలిని అనుసరించి, సాఫల్యం పొందగలిగితేనే, అమల్ కంపెనీ సార్థకమవుతుంది. లేకపోతే అది ఆశయ సిద్ధిని పొందలేదని గట్టిగా చెప్పవచ్చు"అని వ్యాసం ముగించారు.

"గురువుకు పాఠాలు చెప్పటమంటే, ఇదే!" అన్నాడు భూపతి.

ఆమె తొలిగా ప్రశంసల నందుకున్నందుకు ఆనందాను భూతి పొందవలసింది కాని మరుక్షణమే తీవ్ర మనోవేదనకు గురిఅయింది. ఆమె మనసులో ప్రసన్నతాభావానికి తావే లేకపోయింది. లోభనీయమైన ప్రశంసాసుధాపాత్ర, ఆమె పెదవులదాకా రాగానే, దూరంగా తోసివేసేది. తన రచన పత్రికలో ప్రచురించి, తనను విస్మితపరచాలని అమలుడు వూహించి ఉంటాడు. ప్రచురించిన పిమ్మట ఏదైనా పత్రికలో

తన రచనను ప్రశంసిస్తూ, సమీక్ష వెలువడితే, అవి రెంటినీ ఒకేసారి చూపించి, తనకోపం చల్లార్చి, ప్రోత్సహిద్దామని అతను సంకల్పించుకుని ఉంటాడు. మరి సమీక్ష వెలువడిన తర్వాతకూడా అమలుడు తనవద్దకువచ్చి, చూపించక పోవ టానికి కారణమేమిటి? ఈ సమీక్ష చదివి అమలుడు నొచ్చు కుని ఉంటాడు. అందుకే ఈ పత్రికలు రెండూ బయట పెట్ట లేదు. చారులత ఏకాంతంగా 'స్వాతంత్ర్యసుఖాయ' నిర్మించుకున్న సాహిత్య కుటీరము, ఆకస్మికంగా ప్రశంస అనే శిలావృష్టికి, కుప్పగా కూలిపోయే పరిస్థితి దాపురించింది. ఆమెకు ఇది ఏమాత్రమూ రుచించలేదు!

భూపతిబాబు వెళ్ళినాక, ఆమె పడకగదిలోకి వెళ్ళి నిశ్శబ్దంగా మంచంమీద కూర్చుంది. ఆమె ఎదుట 'సరోరుహా' 'విశ్వబంధు' మాసపత్రికలు, పడివున్నవి.

అంతలో అమలుడు ఆమెను ఆశ్చర్యపరచాలనే వుద్దే శంతో, పత్రిక చేతపట్టుకుని, అడుగులో అడుగువేస్తూ గది లోకి ప్రవేశించాడు. చారు 'విశ్వబంధు' పత్రికలోని సమీక్ష ముందరపెట్టుకుని మైమరచివుంది!

అమలుడు గదిలోకి వచ్చినమాదిరే నిశ్శబ్దంగా వెళ్ళి పోయాడు. 'నా శైలిని నిందించి, ఆమె శైలిని కొనియాడిన ఆనందంలో ఆమె బాహ్యప్రపంచాన్నే మరచిపోయింది!' యీ ఆలోచన రాగానే అతని మనసు విషాక్తమయినట్టుంది. ఎవరో వొక మూర్ఖుడి సమీక్షకు పొంగిపోయి, గురువును మించానని భావిస్తున్నందుకు, ఆమెమీద కోపం ముంచు

కొచ్చింది. ఆమె ఆ పత్రికను ముక్కలు ముక్కలుగా చింపి, నిప్పుల్లో పోయవలసింది అని మనసులో అనుకున్నాడు.

అమలుడు చారుమీద కోపగించుకొని, మందాకిని గది వద్దకు వెళ్ళి ఆమెను పిలిచాడు. మందాకిని అతని కంఠస్వరం చెవినిపడగానే, స్వాగతం చెప్పింది, "రా బాబూ! యివాళ అయాచితంగా దర్శనాలయినవి. అందుకు నా అదృష్టాన్ని యేమని కొనియాడను!"

"నావి ఒకటి రెండు కొత్తరచనలు తెచ్చాను, వింటావా?"

"నీవు యెప్పుడూ ఆశపెట్టటమేకాని వొక్కనాడైనా విన్పించిందెక్కడ! వద్దులే బాబూ! మళ్ళీ యెవరికైనా కోపం వస్తే, నీకే తంటా—నాదేంపోతుంది!"

అతను కొంచెం తీక్షస్వరంతో – "కోపంవస్తుందా, యెందుకు – సరే, ఆ విషయం నేనుచూసుకుంటాను, గాని నీవు విను!" అన్నాడు.

మందాకిని చాల శ్రద్ధాసక్తులతో వినటానికి సిద్ధమై కూర్చుంది. అమలుడు కమ్మని కంఠంతో దర్పంగా చదవనారంభించాడు.

అతని రచనలు మందాకినికి సరికొత్త; ఆమెకేమీ అంతుపట్టటంలేదు. అందువల్ల ఆమె మోముమీద ఆనంద రేఖలు వెలిబుచ్చుతూ, మహాదీక్షగా ఆలకిస్తూవుంది. "అభిమన్యుడు గర్భావస్థలో వ్యూహంలోకి చొచ్చుకుపోవటమే అభ్యసించాడు. వెలికిరావటం నేర్చుకోలేదు. అదేమాదిరి నదీ ప్రవాహం పర్వతలోయల పాషాణ గర్భంలో పడివుంది.

ముందుకు సాగిపోవటమే నేర్చుకుంది, కాని వెనకకు తిరిగి రావటం చేతకాదు. నదీప్రవాహం, యౌవ్వనం, కాలం, ప్రపంచం — యివన్నీ ముందుచూపు గలవి. సువర్ణమండిత స్మృతిశిలాఖండాలను విరజిమ్మి వచ్చిన మార్గాన మళ్ళీ యెన్నడూ పాదంపెట్టవు! మానవుని మనసుమాత్రం వెనుదిరిగి చూడగలదు; ఈ అనంత జగత్తు అటుకేసి చూసిన పాపాన కూడా పోదు!"—

సరిగా ఆసమయాన వాకిట్లో యెవరిదో నీడకన్పించింది. మందాకిని చూసీ చూడనట్లు గమనిస్తూనే వుంది. ఆమె రెప్ప వేయకుండా, అమలుని మొహంకేసి చూస్తూ, స్థిర, గంభీర మనోయోగంతో వింటూవుంది. ఆ నీడ మరుక్షణమే అదృశ్యమయింది!

అమలుడు రాగానే, అతనియెదట 'విశ్వబంధు' మాసపత్రికను తగురీతిగా నిందించాలని, ప్రతిజ్ఞాభంగం చేసి, అమలుడు, ఆమె రచనలు పత్రికలో ప్రచురించినందుకు మందలించాలని ఏకనిర్ణయానికి వచ్చి, అతనికోసము యెదురు చూస్తూవుంది. కాని అతను వచ్చేవేళ మించిపోయింది; యెక్కడా అయిపులేదు! ఈలోపు ఆమె మరొక రచన పూర్తి చేసి, అమలునికి విన్పించాలని ఆరాటపడుతూంది. కాని శ్రోత రాకపోవటంవల్ల అలానే ఉండిపోయింది.

అప్పుడేయెటునుంచో అమలుని కంఠస్వరం విన్పించింది. "ఇదా సంగతి! మందాకిని గదిలో!" నని స్ఫురించగానే శరాఘాతురాలిమాదిరి లేచి పిల్లి అడుగులతో మందాకిని గదివద్దకు వెళ్ళి నిలబడింది. అమలుడు చదివే రచన తాను యింతవరకు

వినలేదు. "మానవుని మనస్సుమాత్రం వెనుదిరిగి చూడగలదు; ఈ అనంతజగత్తు అటు కేసిచూసిన పాపానకూడా పోదు."

చారు యెలా వచ్చిందో అలా నిశ్శబ్దంగా అక్కడ నుంచి వెళ్ళలేకపోయింది. ఇవాళ అడుగడుగునా అవమానానికి గురిఅయి, ఆమె ఓర్పు సన్నగిల్లింది. "మందాకినికి వాక్యపంక్తికూడా అర్థంకాదు. మరి యేమనుకుని, అమలుడు మూర్ఖునిమాదిరి తన రచనలు విన్పించి సంతృప్తిపడుతున్నాడు! ఈ విషయం గొంతెత్తి చెప్పాలనుకుంది. కాని అలా చేయలేక కోపంవచ్చి కాళ్ళచప్పుడుతో ఈ భావం వ్యక్తంచేసి తన గదికివెళ్ళి తలుపులు గడియవేసుకుంది.

అమలుడు క్షణకాలం చదవటం ఆపాడు. మందాకిని ముసిముసి నవ్వులు నవ్వుకుని, చారు గదికేసి కనుసన్నచేసింది "వదిన నన్ను క్రీతదాసుణ్ణిగా ఎంచుతూవుంది. నా రచనలు ఆమెకు వినా, మరొకరికి విన్పించకూడదట! నానాటికీ ఆమె దౌష్ట్యానికి అంతులేకుండావుంది" అని, అమలుడు మనసులో అనుకుని యింకా బిగ్గరగా చదవసాగాడు.

చదవటం ముగిసినాక, చారులత గదిముందరగానే వెళ్ళుతూ, ఒకసారి ఆ గదివంక కన్నెత్తి చూశాడు. చారు కూడా కాలి అలికిడినిబట్టి అమలుడు యిటే వెళ్ళినట్లు గ్రహించింది. అతను క్షణకాలంకూడా ఆగనందుకు క్రోధక్షోభాలతో ఆమె కంఠం అవరుద్ధమయింది. ఆమె తన కొత్త రచనలన్నీ తీసి, వాకొక్కటీ చించి, పోగులుపెడుతూవుంది పాపం, ఏ దుర్ముహూర్తంలో రచనా వ్యాసంగానికి ఉపక్రమించారో ఆ యిద్దరూ!

# 8

సందెవేళ వరండాలోని మల్లెలు, సువాసనలు వెదజల్లుతున్నవి. విడిపోయిన మేఘాల్లోనుంచి నిర్మలాకాశంలో నక్షత్రాలు కన్పిస్తున్నవి. చారు యింకా తల దువ్వుకోలేదు, దుస్తులు మార్చుకోలేదు. కిటికీదగ్గిర మసకచీకట్లో వొంటరిగా కూర్చునివుంది. పిల్లవాయువులు ఆమె శిరోజాలతో ఆటలాడుకుంటున్నవి. కళ్ళనుంచి కన్నీటిచుక్కలు రాలేదికూడా తెలియకుండా అలానే కూర్చునివుంది.

అంతలో భూపతిబాబు వచ్చాడు. అతనిమోము ఉదాసీనంగా, హృదయంభారాక్రాంతంగా వుంది. ఇది సాధారణంగా అతను వచ్చే వేళకాదు. పత్రికపనులు చక్కబెట్టుకుని, ఇంటికి వచ్చేటప్పటికి ఆలస్యమవుతూవుండేది. ఇవాళ అతను చీకటి పడుతుండగానే, చారు వద్దకు ఆమె సానుభూతిని ఆశించి వచ్చాడు. అతను కొంచెం ఆశ్చర్యంతో—"చారూ!" అని పిలిచాడు.

అకస్మాత్తుగా భూపతిబాబు పిలుపువిని, ఆమె తుళ్ళిపడింది. ఇంక పెందలకడ వస్తారని ఆమె వూహించలేదు. భూపతిబాబు ఆమె జుత్తు వేళ్ళతో సవరిస్తూ స్నేహార్ద్రకంఠంతో–"చీకట్లో వొంటరిగా కూర్చున్నావేం! మందాకిని యెక్కడికి వెళ్ళింది?" అన్నాడు.

చారు అనుకున్నట్టుగా యివాళ యేదీ జరగలేదు.

అమలుడు వచ్చి క్షమాపణ వేడుకుంటాడని ఆమె నమ్మకం! అందుకు ఆమె సిద్ధమై కూర్చుంది. కాని తలవనితలంపుగా భర్త కంఠస్వరంవిని, ఆమె తనను సంబాళించుకోలేక ఆపుకు మని యేడ్చింది.

భూపతిబాబు వ్యాకులపడుతూ–"ఏమిజరిగిందిచారూ?" అని అడిగాడు.

'ఏమిజరిగిందో' చెప్పటం అంత తేలికకాదు. చెప్ప టానికి అసలు జరిగిందిమాత్రం యేముంది? 'అమలుడు తన రచన ముందుగా మందాకినికి విన్పించా'డని యవరికి చెప్పా కుంటుంది? ఆమాటవింటే, భూపతిబాబు యెగతాళిచేయడూ? ఇంత అల్పవిషయాన్ని పురస్కరించుకుని, ఒకరిపెద్దఅభియోగం తేవటానికి మూలకారణాన్ని అన్వేషించగలగటం చారువల్ల అసాధ్యమని చెప్పవచ్చు. నిష్కారణంగా ఇంత దుఃఖపడట మెందుకో అర్థంకాక, ఆమె మనోవేదన ఇంకా అధికమయింది.

"ఏంజరిగిందో చెప్పవూ? నావల్ల యేమైనా అన్యాయం జరిగిందా?– నేనెప్పుడూ ఏవోపనిపాటల్లో తలమునకలుగా వుంటానని నీకు తెలియకపోలేదు. నీ మనస్సును యేమైనా నొప్పించివుంటే, అది తెలిసిమాత్రం కాదు!"

భర్త ప్రశ్నకు ఏమిసమాధానంచెప్పాలో పాలుబోక, ఆమె మరీ అధీరురాలయింది. వారు కాసేపు నన్ను ఒంటరిగా విడిచిపెడితే, బ్రతికిపోతాననుకుంటూంది లోలోపల.

భూపతిబాబు, ఆమెవద్దనుంచి ఏమీ జవాబు రాక పోయేప్పటికి, మళ్ళీ స్నేహాసిక్తస్వరంతో చెప్పసాగాడు–"నేను ఎక్కువసేపు నీవద్ద ఉండకపోవటం, నాతప్పే! అందుకు నాకు

చాల లజ్జగా వుంది. ఇకనుంచి అలా జరగదు. అహోరాత్రులు పత్రికలతో ఇల బద్దలుచేసుకోకూడదని నిర్ణయానికివచ్చాను. ఇవాళనుంచి నీయిష్టంవచ్చినంత సేపు ఇంట్లోనేవుంటాను!"

చారు అధీరురాలై- "అందుకుకాదు..." అంది.

"మరి దేనికి?" అంటూ, భూపతిబాబు మంచంమీద కూర్చున్నాడు.

చారు తన విరక్తిని కప్పిపుచ్చలేకపోయింది. "ఇప్పుడు కాదు, రాత్రికి చెపుతాను!"

భూపతి క్షణకాలం స్తబ్ధుగావుండి- 'మంచిది, అలానే, అంటూ, నెమ్మదిగా లేచి బయటికివెళ్ళిపోయాడు. పాపం తాను చెప్పాలనుకున్నదికూడా, ఆమెతో చెప్పలేకపోయాడు.

భూపతిబాబు ఒకవిధమైన మనోవ్యధతోటే తిరిగివెళ్ళాడని చారు అనుగాహన చేసుకోలేకపోలేదు మనసులో ఒకసారి పిలుద్దామూ అనిపించింది. కాని వచ్చినాక ఏమిమాట్లాడేట్టు? సానుతాపం ఆమె హృదయాన్ని గాయపరిచింది కాని దానికి ప్రతిక్రియ ఏమిటో, ఎంతకూ తోచలేదు.

ఆరాత్రి చారు, భర్తకు చాలశ్రద్ధతో అన్నంవడ్డించి, విసనకర్ర చేతబట్టుకుని, వారికోసం నిరీక్షిస్తూవుంది.

అప్పుడే మందాకిని 'బిరజూ' నౌకర్నిపిలిచి- 'అమల బాబు భోజనమయిందా?' అని అడిగింది. వాడు 'బాబుగారు భోంచేశా'రని చెప్పాడు. 'భోజనాలుకాగానే, తాంబూలం ఎందుకు తీసుకెళ్ళలేదు?' అని మందాకిని వాణ్ణి తలవాయు చీవాట్లు పెడుతూవుంది.

అంతలో భూపతిబాబు భోజనానికివచ్చి కూర్చున్నాడు; చారు విసురుతూవుంది.

ఇవాళ భర్తతో ప్రసన్నంగా, మార్దవంగా మాట్లాడాలని చారులత ప్రతిజ్ఞచేసింది. విషయనిర్ధారణకూడా ముందుగానే ఆలోచించి చేసుకుంది. కాని మందాకిని కంఠస్వరం ఆమె పథకాన్ని తారుమారుచేసి వ్రూయకుంది. తత్ఫలితంగా, భర్త వద్ద పెదవివిప్పి ఒక్క మాట చెప్పలేకపోయింది! భూపతిబాబు కూడా చికాకుగా, అన్యమనస్కంగా వున్నాడు. అతను సరిగా భోంచేసినట్టులేదు. చారు ఒక్కసారిమాత్రం– 'అన్నంకలిపి, అంతా వదిలివేస్తున్నారేం!' అంది. 'ఏం, నేను తక్కువ తినలేదే!' అన్నాడు భూపతిబాబు.

అతను పడకగదిలో–"ఇందాక రాత్రికి యేదో చెపుతానన్నావుకదూ!" అన్నాడు చారుతో.

"చూడండీ. కొన్నాళ్ళనుంచి మందాకిని తీరు నాకేమీ బాగుండలేదు. ఇకను ఆమెను ఇక్కడ వుంచటానికి నాకు ధైర్యం చాలటంలేదు."

"యేం జరిగిందేమిటి?"

"[illegible] ఆమె ప్రవర్తన చూసినవాళ్ళు, సిగ్గుతో తల యెత్తలేకపోతున్నారు."

అతను మందహాసంచేసి – "నీకు మతిపోయినట్టుంది! అమలుడు యింకా కుర్రవాడు, సరిగ్గా కళ్ళు–"అన్నాడు.

"మీరు ఇంటిసంగతులు పట్టించుకోరు. ప్రపంచంలోని సంగతులతో పత్రికలన్నీ నింపుతుంటారు. ఏమైనా, నాకు అన్నాయినిగురించే చింతగా వుంది. అన్నాయి తిన్నదీ, లేనిదీ

కూడా ఆమె పట్టించుకోవటంలేదు. అమలునిగురించి మాత్రం తాంబూలంలో కొంచెం సున్నం తక్కువైతే చాలు, నౌకర్లని యిల్లు యెగిరిపోయేట్టు కేకలు పెడుతుంది."

"అసలు స్త్రీలందరూ, సందిగ్ధ మనస్కులు! ఇందులో యేముందిలే!" అని భూపతి చప్పరించాడు.

"సరే, మేము సందిగ్ధమనస్కులమయితే మానె! కాని నా యింట్లోమాత్రం ఇలాంటి సిగ్గుమాలినపని సాగనివ్వను!"

నిరాధారమైన చారు అనుమానానికి భూపతిబాబు మనస్సులో నవ్వుకున్నాడు – కొంచెం సంతృప్తి చెందాడని కూడా చెప్పవచ్చు! కుటుంబం పవిత్రంగా వుండటానికి దాంపత్య ధర్మానికి వ్యాహోమాత్రంగానయినా, కళంకం సోకకుండా వుండటానికి, సతీసాధ్వులయిన స్త్రీలు అప్రమత్తులై, వొక కంట కనిపెడుతూ వుంటంలోసైతం వొక విధమయిన మాధుర్యము, మహత్తూ వుంది. భూపతి శ్రద్ధా స్నేహాలతో ఆమె లలాటం చుంబించి – "యీమాత్రానికి గగ్గోలు పడ నక్కరలేదు. వుమాపతి ప్రాక్టీసు పెట్టటానికి మైమనసింగు వెళ్తూ, భార్యనుకూడా తీసుకెళ్ళుతాడు" అని చెప్పాడు.

భూపతిబాబు తన దుశ్చింత, కు ప్రతిపుస్తక భావనా మరిచిపోదామని టేబులుమీదనుంచి వ్రాతపుస్తకం తీసి "ఇవాళ నీ కొత్తరచన యేదైనా విన్పించు చారు!"అన్నాడు.

చారు చప్పున ఆ పుస్తకం లాక్కుని – "ఇది మీకు నచ్చదు. యెగతాళి చేస్తారు!" అంది.

భూపతి బాబు కొంచెం నొచ్చుకుని చారు చూడకుండా నవ్వుతూ–"లేదు. యెగతాళి చేయను! నిద్రపోతున్నా

వని నీకు భ్రమకలిగేట్టు, శ్రద్ధగా వింటాను." అని చెప్పాడు. అయినా భూపతి మాట పని చేయలేదు. చూస్తూండగానే, ఆమె రచనలన్నీ యెక్కడివక్కడ మాయమయినవి.

## 9

భూపతిబాబు తన మనసులోని విషయాలు చారుతో చెప్పలేకపోయాడు. వుమాపతి ఆఫీసు మేనేజరు. చందాలు, ప్రింటింగు పేపరు వ్యవహారాలు, నౌకర్లకు జీతబత్తాలు, సమస్తం వుమాపతికే అప్పగించాడు.

ఈ మధ్యనే అకస్మాత్తుగా న్యూసు ప్రింటువాళ్ళు లాయరు నోటీసు యిప్పించారు. భూపతి చకితుడయాడు. వాళ్ళబాకీ దాదాపు మూడు వేలదాకా వుంటుంది. అతను వుమాపతిని పిలిచి "ఈ నోటీసేమిటి? ఆ తాలూకు డబ్బు నీచేతి కెప్పుడో ఇచ్చాను. వాళ్ళబాకీ నాలుగైదు వందలకంటె మించకూడదే!" అన్నాడు.

"వాళ్ళు యెక్కడో పొరపాటు పడివుంటారు."

కాని విషయం ఎక్కువరోజులు దాగలేదు. కొంత కాలంనుంచి వుమాపతి యిలానే మోసం చేస్తున్నాడు. ఒక్క న్యూస్ప్రింటు వాళ్ళకేముంది, బజారులో అందినంతవరకు భూపతిపేర అప్పులు తెచ్చాడు. స్వగ్రామంలో కడుతున్న యింటికి కావలసిన సామగ్రిఅంతా. భూపతిపేర యేదో ఒక ఖాతాను ఎక్కించి జేరవేశాడు.

చివరికి పట్టుపడగానే, వుమాపతి రూక్షస్వరంతో "నేనేమీ దేశంవిడిచిపోవటంలేదు. నెమ్మదిగా మీబాకీ చుస్తాగా

తీర్చుకుంటాను. లేకపోతే నన్ను మారుపేరున పిలవండి!"
అన్నాడు.

నామ పరివర్తనంతో భూపతిబాబుకు వొరిగేదేమీ లేదు. అతను ధననష్టానికి దుఃఖపడటంలేదు. కాని వుమాపతి నమ్మకద్రోహానికి నిలువున నీరై, కాళ్ళూ చేతులూ ఆడటం లేదు.

ఆనాడే అతను వేళకాని వేళ చారువద్దకు వెళ్ళాడు. ఈ ప్రపంచంలో కనీసం ఒకతావును నమ్మకోపచ్చునసే అను భూతికోసం అతని హృదయం ఆరాటపడింది. కాని అప్పుడు చారు తన దుఃఖంతోనే, సందెదీపం పెట్టకుండా చీకట్లో కిటికి వద్ద కూచ్చునివుంది.

వుమాపతి మరునటిరోజే ప్రయాణానికి సిద్ధపడ్డాడు. మార్కెట్టులో పాక్కుకముందే, యిక్కడనుంచి జారుకోవాలని చూస్తున్నాడు. భూపతి యేవగింపుతో పలకరించలేదు. వుమాపతి, ఆ పరాభవం తన అహోభాగ్యమనుకున్నాడు.

అసులందు వచ్చి మందాకినిని "మూటాముల్లె కట్టుకుని ఎక్కడికి ప్రయాణమయ్యారు?" అని అడిగాడు.

"పరాయి యింట్లో యెంతకాలమని ఉంటాము. ఎప్పుడో ఒకనాటికి వెళ్ళవలసిందేగదా!"

"యింతకూ యెక్కడికి ఈ ప్రయాణం?"

"స్వగ్రామం!"

"ఇక్కడ యేమి యిబ్బంది వచ్చింది?"

"నాకేం యిబ్బంది బాబూ, మీఅందరితో కలిసివుండటం

నాకు హాయిగానే వుంది. కాని అందరికీ అలా వుంటుందా!”
అని, మందాకిని చారు గదికేసి, చేసన్న చేసింది.

అమలుడు గంభీరుడై ఏమీ మాట్లాడలేదు.

“ఛీ! ఛీ! భూపతిబాబు మనసులో ఏమనుకుంటారో తని తగని సిగ్గుగా వుంది!” అన్నది మందాకిని.

అమలుడు ఈ విషయాన్ని గురించి తర్వాత ఏమీ చర్చకు దిగలేదు. చారు మా ఇద్దరిమీద చెప్పకూడనిమాట ఏదో అన్నాయి చెవిని వేసి వుంటుందనిమాత్రం మనసులో అనుకున్నాడు.

అతను ఇంట్లోనుంచి బయటికి వచ్చి, రోడ్డుమీద పచారుచేస్తున్నాడు. ఇకను ఆ ఇంట్లో అడుగు పెట్టటానికి అతని మనస్సు వప్పటంలేదు. అన్నాయి వదిన చెప్పినమాట నమ్మి తనను అపరాధిగా యెంచితే, మందాకిని అనుసరించినమార్గమే తనకూ తప్పదు! మందాకినికి వుద్వాసన చెప్పటం, ఒకవిధంగా తనకూ బహిష్కారాదేశం వచ్చినట్టే—కాకపోతే నోటి మీదగా చెప్పలేదు, అంతే! ఇకను నా కర్తవ్య మేమిటో స్పష్టమయింది; క్షణకాలంకూడా ఇక్కడ వుండకూడదు. కాని అన్నాయికి తనమీద ఎలాంటి దురభిప్రాయం ఏర్పడటమూ మంచిదికాదు. ఇన్నాళ్ళనుంచి నన్ను నమ్మి, ఇంట్లో స్థానమిచ్చి, పెంచి పెద్దచేశాడు. ఆ నమ్మకాన్ని నేను చింతాకంతకూడా భంగపరచలేదని అన్నాయికి విప్పి చెప్పకుండా వెళ్ళేది ఎలాగు?

భూపతిబాబు, బంధువర్గం కృతఘ్నత, ఋణదాతల తాకీదులు, దొంగలెక్కలు, చిల్లిగవ్వ మిగలని పెట్టుబడి...

యీా వెంగతో తలవట్టుకు కూర్చున్నాడు. ఈ శువ్కమాన సిక దుఃఖంలో అతనికి ఎవరూ తోడులేరు. ఈ గంభీర మనో వేదనను ఋణభారాన్ని యేకాకిగానే ఎదుర్కోవటానికి సిద్ధపడుతున్నాడు. ఇంతలో అమలుడు తుఫానుమీాదిరి గదిలో ప్రవేశించాడు. దుశ్చింతలలో మునిగి తేలుతున్న భూపతిబాబు వులికిపడి, అతనివంక చూచి—"విశేషాలేమిటి?" అని పలుకరించాడు అమలుడు ఏదో దుర్వార్త తెచ్చివుంటాడని పించింది భూపతిబాబుకు.

"అన్నాయి! నన్ను సందేహించటానికి ఏదైనా కారణం వున్నదా?"

భూపతి ఆశ్చర్యంతో—"సందేహించటమా, నిన్ను! అన్నాడు. లోకంతీరు గమనిస్తుంటే, ఒకనాటికి సందేహించినా అబ్బురమేమీా లేదు అనుకున్నాడు మనసులో.

"వదిన నా ప్రవర్తనగురించి ఏమైనా చెప్పిందా?"

"ఇదావిషయం! సరే, బ్రతికిపోయాను! స్నేహాభినయం యిది! మళ్ళీ కొంపమీాదికి ఏమిముంచుకువచ్చిందో అనుకున్నాను. ఇలాంటి ఘోరసంకటావస్థలోకూడా యీా తుచ్ఛ విషయాలు ఆలకించక తప్పటంలేదు. ప్రపంచం ఒకచెంపన వంతెనను ఒకవూపు వూపిచూస్తూనే, మరోచెంపన తన వస్తు వాహనాలు జేరవేసుకుంటుంది! లోకంతీరే అంత! మరోసమయాన అయితే భూపతిబాబు, అమలుని ఎగతాళిచేయకుండా విడిచిపెట్టేవాడుకాదు. కాని ఇవాళ అతనిమనసులో ప్రసన్నత కలికానికికూడా లేదు. "నీకేమైనా మతిపోయిందా అమల్?"

"వదిన ఏమీా చెప్పలేదా?"

"నిన్ను అమితస్నేహంతో చూస్తుంది. ఒకవేళ చెప్పినా అందులో కోపగించుకోవలసిందేమీ లేదు!"

"నేను ఉద్యోగంకోసం ఎక్కడికైనా వెళదామనుకుంటున్నాను."

"అమల్, నీ తుంటరితనానికి మితిలేకుండా వుంది. ముందు శ్రద్ధగా చదువుకో, తర్వాత ఉద్యోగంసంగతి!" అని మందలించాడు భూపతి.

అమలుడు మొహం చిన్నబుచ్చుకుని అక్కడనుంచి వెళ్ళాడు. భూపతి చందాలరిజిష్టరులోని జమాఖర్చులు టాలీ చేసుకుంటున్నాడు.

# 10

అమలుడు బాగా యోచించుకుని, అన్నాయిని, వదినను ఒకచోట కూర్చోబెట్టి, యీ విషయం తేల్చుకోవాలని నిర్ణయించుకున్నాడు. తర్వాత వదినకు అప్పగింత పెట్టవలసిన మాటలు నాలుగూ తీవ్రంగా మననంచేసుకుంటున్నాడు.

మందాకిని వెళ్ళిపోయింది. చారు అమలుణ్ని పిలిచి అతని కోపం శాంతపరచాలని సంకల్పించుకుంది. కాని అతన్ని ఏదో ఒకరచన విన్పించే నెపంతో పిలవాలి. అమలునిరచనను అనుకరిస్తూ, చారు 'అమావాస్యప్రకాశం' వ్రాసింది. అతనికి తన స్వతంత్రశైలి రుచించదని ఆమె యెప్పుడో అర్థంచేసుకుంది.

"పూర్ణిమ తన సమస్తకాంతిని ఒక్కసారిగా ప్రకటించి" నందుకు, చారు నిరసించింది. "షోడశకళాపూర్ణుడయినచంద్రుని సమస్తప్రకాశము, అమావాస్య గాఢాంధకారంలో పొరలు

పొరలుగా బంధింపబడివుంది; చంద్రకళ ఒక్కటే విలుస్తం కాలేదు. అందువల్లనే పూర్ణిమ వుజ్వలతకారణంగా, అమావాస్యనాటి అంధకారం ఇంత పరిపూర్ణంగా వుంది!" అని వ్రాసింది. అనులుడు తన రచనలు అందరికీ విన్పిస్తాడు, చారు అలా చేయదు. పూర్ణిమ, అమావాస్య వుపమానంలో ఈ ఆభాస యేమైనావుందా?

కుటుంబంలోని తృతీయ వ్యక్తి భూపతిబాబు, గడువు సమీపిస్తున్న ఋణదాత నోటీసునుంచి బయటపడదామని, తన ప్రాణమిత్రుడు మోతీలాలువద్దకు వెళ్ళాడు. కష్టకాలంలో మోతీలాలుకు కొన్నివేలు అప్పుపెట్టి ఆదుకున్నాడు. ఇవాళ ఈ ఘోర సంకట సమయంలో భూపతిబాబు ఆ బాకీకోసమే వచ్చాడు. మోతీలాలు అప్పుడే స్నానంచేసి, వొంటిమీద చొక్కాకూడా లేకుండా, విసనక్రరతో విసురుకుంటూ, చిన్న చిన్న అక్షరాల్లో 'సహస్రదుర్గానామం' వ్రాసుకుంటున్నాడు. అతను భూపతిబాబును చూసి, చాలా సౌహార్ద భావంతో— "రా, రా! యెక్కడా నీ దర్శనమే కావటంలేదు!" అని పలకరించాడు

తర్వాత, డబ్బుమాట హెచ్చరించగానే, మోతీలాలు దిక్కులు చూస్తూ - "డబ్బేమిటి? ఈమధ్య యేమైనా తీసుకున్నానా?" అన్నాడు.

భూపతి సంవత్సరం, తారీఖులతో అంతా గుర్తు చేశాడు.

మోతీలాలు విరగబడి నవ్వుతూ - "నీవుచెప్పేది ఆ

పాతబాకీ సంగతా! దానికి కాలదోషంపట్టి చాలారోజు లయింది!" అన్నాడు.

భూపతి దృష్టిలో ప్రపంచమే మారురూపు దాల్చి నట్టుంది. ముసుగు తొలగిన ప్రపంచ సరళినిచూసి, భూపతి బాబుకు వొళ్ళు జలదరించింది. హఠాత్తుగా వుప్పెనవచ్చినపుడు, భీతిచెందిన మానవుడు మేరకకన్పించిన దిక్కుకు పరుగెత్తినట్టు భూపతికూడా ఈ నిష్ఠుర బాహ్యప్రపంచంనుంచి తన అంతః పురానికి చేరుకున్నాడు. "ప్రపంచం తీరు యెలావున్నప్పటికీ, చారు మాత్రం నన్ను వంచించ'దని మనసులో అనుకున్నాడు.

చారు అప్పుడు మంచంమీద వొళ్లో దిండుపెట్టుకుని, దిండుమీద నోటుబుక్కుపెట్టి, ముందుకువంగి యేదో వ్రాస్తూ వుంది. భూపతిబాబు బాగా సమీపానికి రాగానే, ఆమె బాహ్యప్రపంచంలోపడి, తడబాటు చెందింది; చప్పున ఆమె బాసికపెట్టుక్రింద నోటుబుక్కు దాచి, సర్దుకు కూర్చుంది.

మనోవేదనవున్న వ్యక్తి స్వల్పవిషయానికే యెంతో నొచ్చుకుంటాడు. చారు యిలా అనవసరంగా కంగారుపడటం, త్వరగా నోటుబుక్కు తీసి దాచటంచూసి, అతని మనసు తీవ్రంగా గాయపడింది. తన రచనా ప్రవాహానికి తలవని తలం పుగా విఘ్నం తటస్థించినందుకు, భూపతియెదటే నోటుబుక్కు దాచినందుకు ఆమె చాల కంగారుపడింది; యికను చారు పెదవివిప్పి వొక్కమాట మాట్లాడలేదు.

ఇవాళ భూపతి తానుగా యివ్వగలిగిందీ చెప్పగలిగిందీ యేమీలేదు. అతను రిక్తహస్తాలతో చారును వేడుకోటానికి వచ్చాడు. చారు సానుభూతి చూపుతూ ప్రేమతో

పలకరించినా అతనికి కొండెక్కినట్టుండేది. సంతృప్తిపడేవాడు. కాని ఇక్కడ పరిస్థితి వేరు. తాత్కాలిక ఉపశాంతి కలిగించ టానికి కూడా ప్రేమ భాండాగారం తాళంచెవి ఆమె ఎంత వెదికినా కంటికి కనపడలేదు! ఆ గదిలోని నీరవత్వం, ఇద్దరి కఠోరమౌనవ్రతంతో ఇంకా ఘనీభవించింది. భూపతి కాసేపు అలాగే కూర్చుని, దీర్ఘంగా నిట్టూర్చి, నెమ్మదిగా బయటికి వెళ్ళాడు.

అదే సమయంలో అమలుడు కటూక్తులన్నీ కంఠస్థం చేసుకుంటూ, చరచరా వాకు గదికేసి వస్తున్నాడు. అతను వారిలో కళాకాంతులులేక, శుష్కించిన భూపతి మొహం చూసి ఉద్విగ్నుడయ్యాడు.

"అన్నాయి! వొంటో బాగాలేదా?"

అకస్మాత్తుగా అమలుని స్నిగ్ధ కంఠస్వరం విని, భూపతి సమస్త హృదయం అశ్రుభారంతో పొంగి పొరలినట్టుంది; కాసేపు అతని నోటమాట రాలేదు. అతికష్టంమీద తమా యించుకుని—"లేదే!—నీ కొత్తరచనలు యేమైనా ప్రింటు అవు తున్నవా యేమిటి?" అన్నాడు.

అమలుడు కంఠస్థం చేసుకున్న కటూక్తులన్నీ క్షణమాత్రంలో అదృశ్యమైనవి! త్వరగా వదిన దగ్గరకు వెళ్ళి—"వదినా యేం జరిగింది? అన్నాయి అలావున్నాడేమిటి?" అని అడి గాడు ఆదుర్దాగా.

"ఊహుం. అలాంటి దేమీలేదు! ఒకవేళ వారి పత్రికను ఎవరైనా దూర్పారపట్టారేమో!"

అమలుడు తల పంకించసాగాడు.

అతను పిలవకుండా నేవచ్చి సహజధోరణిలో మాట్లాడటం చారుకు చాల హాయి అనిపించింది. ఆమె వెంటనే తన లేఖ ప్రసక్తితెచ్చి-"ఇవాళ నేను 'అమావాస్య ప్రకాశం' వ్రాస్తున్నాను. కొంచెం యేమరిస్తుంటే వారు చూసేవారే!" అని చెప్పింది.

అమలుడు తన రచన చూపమని బలవంతంచేసి, పీడిస్తాడని ఆమె గట్టిగా అనుకుంది. అందుకే తన నోటుబుక్కు తీసి చేతితో అటూ ఇటూ ఊపింది. కాని అతను తీవ్రదృష్టితో వొక పర్యాయం ఆమె మోమువంక చూశాడు. అతను మనసులో యేమనుకున్నాడో చెప్పలేము! ఆ మరుక్షణమే త్రుళ్ళిపడి లేచి నిలబడ్డాడు. పర్వతమార్గాన ప్రయాణించే బాటసారి పొగమంచు విడిపోగానే, మరొక అడుగు ముందుకువేస్తే, పాతాళపురికి తీసుకుపోయే అగాధమైన లోయ యెదట చూసినట్టు పులికిపడ్డాడు! అతను కొన్ని క్షణాలు ఆగి, యేమీ మాట్లాడకుండా నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు.

అమలుని ఈ అపూర్వప్రవర్తన భావమేమిటో ఆమెకు బొత్తిగా అర్థంకాలేదు. ఆమె స్తబ్ధంగా కూర్చుని, అతని గమనం చూస్తూవుంది.

## 11

భూపతి మరునాడు మళ్ళీ పడకగదికి వెళ్ళి చారును పిలిచి అమలునికి మంచి సంబంధం వచ్చింది." అని చెప్పాడు. చారు అన్యమనస్కురాలుగా వుంది. "ఏమిటా వచ్చింది?"

"సంబంధం!"

"ఏం, నేను నచ్చలేదా!"

భూపతి బిగ్గరగా నవ్వి - "నీవు నచ్చావో లేదో యింతవరకు అమలుని అడిగి చూడలేదు. ఒకవేళ నచ్చినా, నావాక్కును అంతత్వరగా వదులుకోబోవటంలేదు" అన్నాడు.

"అబ్బ, అలా అవాకులు చవాకులు మాట్లాడతా రేమిటి? మీకొక మంచి సంబంధం వచ్చిందని స్వయంగా చెప్పితిరి!" అని చెపుతుండగానే ఆమెమోము యెర్రవారింది.

"అలా అయితే పరుగెత్తుకుంటూ వచ్చి నీకే చెప్పాలి మెచ్చి మేకతోలు కప్పుతావని!"

"అయితే, మరి అమలునికా మంచి సంబంధంవచ్చింది! మంచిదే, శుభస్య శీఘ్రం! కానివ్వండి!"

"రఘునాధబాబు వకీలు, వారే తమ పిల్లను అమలునికిచ్చి పై చదువులకు అమలుని విదేశాలకు పంపు కుంటామని వర్ధమానునుంచి వర్తమానం పంపారు!"

చారు చకితురాలై - "విదేశాలా?" అంది.

"అవును!"

"అమలు విదేశాలు వెళ్ళుతాడా! బాగుంది మంచిదే! మీరొకసారి కదిపి చూడండి!"

"ముందుగా నీవొకపర్యాయం నచ్చజెప్పటంమంచిది!"

"నేను లక్షసార్లు చెప్పిచూశాను. ఇక్కడ నామాట చెవిని బెట్టేది యెవరు! నా వల్లకాదు!"

"పెళ్ళికి వొప్పుకోడనిపిస్తుందా?"

"యీావరకు చాలాసార్లు ప్రయత్నించి చూశాను. సమ్మతిస్తేనా!"

"కాని ఇప్పుడు ఈ సదవకాశం చేజారిపోనివ్వటం మంచిదికాదు. నేనూ అప్పట్లో మునిగివున్నాను. పూర్వం మాదిరి అమలుని ఇంట్లో వుంచుకుని, చదువు సంధ్యలు చెప్పించటం కష్టమౌతుందేమో!"

భూపతిబాబు అమలుని పిలిపించి - "వర్ధమాన వకీలు రఘునాథబాబు నీకు పిల్లనిస్తామని కబురుచేశారు. పెళ్ళి కాగానే, నిన్ను చదువుకు విదేశాలు పంపుతామనికూడా చెప్పారు. నీ ఉద్దేశమేమిటి?" అని అడిగాడు.

"మీకు సమ్మతమైతే, నాకేమీ అభ్యంతరంలేదు."

అమలుని జవాబుకు భూపతి, చారు యిద్దరూ చాల ఆశ్చర్యపడ్డారు. అమలుడు ఒకమాత్రాన సమ్మతిస్తాడని ఎవరూ వూహించలేదు.

చారు తీవ్రస్వరంతో పరిహాసంచేస్తూ "యివాళ అన్నాయి సమ్మతి కావటమే తడవు, తల యెగరవేశావు, ఆహా! మీ సోదరుని వినయవిధేయతలు చూడండి! యింత కాలంనుంచి అన్నాయిమీద యీ భక్తి యేమైపోయింది మరిదీ!" అంది.

అమలుడు మారు పలకకుండా, నవ్వటానికి ప్రయత్నించాడు.

అమలుడు మౌనవ్రతము పట్టటంచూసి, చారు అతన్ని హెచ్చరిస్తున్నట్లు ఆవేశంతో "బాబూ, నాకీపెళ్ళి చేసుకోవాలని వుందని చెప్పరాదూ, మధ్యలో సాకు అన్నాయి అనుమతి దేనికి?" అంది.

భూపతి మందహాసంచేస్తూ "అమలుడు యిన్నాళ్ళ నుంచి తొడికోడలు పేరువింటే, నీ కెక్కడ యీర్ష్య కలుగు తుందోనని కాదంటున్నాడులా వుంది!" అన్నాడు.

ఆమాటకు చారువోము ఆరక్తమయింది. ఆమె గోలపెడుతూ "నాకు యీర్ష్యా! యెప్పటికీ కలగదు. మీరు అలా మాట్లాడటం చాలా అన్యాయమంటాను" అంది.

"అదుగో చూడు, నేను భార్యతోకూడా పరిహాస మాడకూడదట!"

"కాదు. యిలాంటి పరిహాసమంటే నాకు గిట్టదు."

"సరే, మహాపరాధం జరిగింది; మన్నించు. అయితే మరి, వివాహవిషయం స్థిరపరుచుకున్నట్టేనా?"

అమలుడు "అవును" అన్నాడు.

"పిల్ల మంచిదో, కాదో చూసేదాకా కూడా ఆగ లేవా మరిదీ! నీవు యిలాంటిస్థితిలో వున్నావని సూచన ప్రాయంగానైనా చెప్పలేదేం!" అంది.చారు.

"అమల్! పిల్లను చూడాలనివుంటే అందుకు ఏర్పాటు చేయవచ్చు. పిల్ల చక్కనిచుక్క అని విన్నాను" అని చెప్పాడు భూపతి.

"లేదు. అలాంటి లాంఛనాలతో యేమీా పనిలేదు."

"చుగిదిగారి మాటవినండి ఈ విడ్డూరం యెక్కడైనా వుందీ! పిల్లను చూసిరాకుండానే పెళ్ళా! వీరికి యిష్టంలేక పోతే మానె, కనీసం మనమైనా చూడాలిగదా!"

"వద్దు అన్నాయి, పెళ్ళిచూపులతో వృథా కాల హరణం యెందుకు?"

"అక్కరలేదూ, కాలహరణమయితే, హృదయం విదీర్ణమవుతుంది కాబోలు! నీవు బాసికం కట్టుకుని నిలుచున్న పాటున బయలుదేరు, లేకపోతే ఆ రాజ్యలక్ష్మిని యెవరైనా తన్నుకెళ్లుతారేమో!"

చారు వేళాకోళానికి అమలుడు కించిత్తుకూడా చలించలేదు.

"విదేశాలు వెళ్ళటానికి లోపల్లోపల యింత తహతహలాడిపోతున్నావు యెందుకు? ఇక్కడ నిన్ను యెవరు కట్టివేసి, ఆపబోతున్నారు! సూటు, బూటు వేసి దొరకాని దే, ఈకాలపు కుర్రకారుకు సంతృప్తికలగదు! మరిదీ, అక్కడనుంచి వచ్చినాక, మాలాంటి శ్యామవర్ణులను గుర్తుపట్టగలవా?"

"అయితే విదేశాలు వెళ్ళిన ఫలితమేముంది!" అని, జవాబిచ్చాడు అమలుడు.

భూపతి నవ్వి - "నలుపు మరవటానికేగదా విదేశాలు వెళ్ళేది? అంత భయమెందుకు చారూ, శ్యామవర్ణోపాసకుణ్ణి నేనువుండగా!" అన్నాడు.

భూపతి ప్రసన్నచిత్తుడై, వెంటనే వర్ధమానం వుత్తరం వ్రాశాడు.

లగ్న నిశ్చయమయింది.

## 12

ఈలోపు భూపతి పత్రిక ఆగిపోయింది. దాని ఖర్చు భరించటం భూపతికి తలకుమించిన వ్యవహారమయింది. అతను ఇంతకాలంనుంచీ యేకాగ్రచిత్తంతో, నిమగ్నమైవున్న 'సార్వ

జనీన' మనే విశాల, నిర్మల పదార్థ సాధనకు క్షణమాత్రంలో స్వస్తి చెప్పవలసివచ్చింది. అతని జీవితంలోని క్రియాకలాపాలన్నీ గత పన్నెండేళ్ళనుంచీ ఏకమార్గాన అవిచ్ఛిన్నంగా సాగి పోతూ, అకస్మాత్తుగా ఏకతాపున అగాధంలో పడిపోయి నట్టుంది. అందుకు భూపతి సంసిద్ధంగా లేడు. తాను తలపెట్టిన ప్రయత్నాలన్నిటికీ ఆకస్మికంగా అవాంతరం వచ్చిపడింది; యేంచేయాలి? క్షుధార్తులయిన అనాధ బాలురమాదిరి, ఆ కార్యక్రమం తన మొహంకేసి చూస్తూవుంది. చివరికి భూపతి వివశుడై, ప్రజారంగానికి తిలోదకాలిచ్చి, అంతఃపురంలో కరుణామయి, సేవాపరాయణ అయిన స్త్రీ వద్దకు చేరాడు.

కాని ఆమె అప్పుడు మనసులో ఏమాలోచించుకుంటుం దనుకున్నారు? 'ఎంత ఆశ్చర్యం! అమలుని పెళ్ళికావటం, మంచిదే! కాని ఇంతకాలానికి మమ్మల్ని విడిచి, పరదేశాలు వెళ్ళుతున్నందుకు అమలునికి చీమకుట్టినట్టు కూడా లేదేం! యింతకాలం కన్నబిడ్డలా పెంచి పెద్ద చేశామనే తలపేలేదు! పారిపోవటానికి కొంచెం సందు చిక్కగానే, మూటాముల్లె సర్దుకు సిద్ధమయాడు. అసలు ఇందుకే ఎదురు చూస్తున్నాడేమో! పైకి ఎంత తియ్యని కబుర్లు చెప్పేవాడు, ఎంత ప్రేమ ఒలికించే వాడు! మనిషిని గుర్తించగలగటం మాటలుకాదు. అంత చక్కగా వ్రాసే వ్యక్తికి 'హృదయమే' వుండదని ఎవరు కల గన్నారు.

చారు తనతో పోల్చుకుని, అమలుని హృదయ విహీ నతను నిరసించ ప్రయత్నించింది కాని ఆమె వల్ల కాలేదు. నిరంతరమూ లోలోపల మనోవేదన, తప్తశూలం మాదిరి

ఆమె అభిమానాన్ని ఆఘాతపరచి, వుద్రేకపడుతూ వుంది. "అమలుడు తెల్లవారితే ప్రయాణమవుతాడు. అయినా ఒక్కసారి ఇటు మొహం చూపలేదు. వారిద్దరిమధ్య ఏర్పడివున్న వైమనస్యం తుడిచిపెట్టటానికికూడా తీరిక చిక్కలేదు !"

అమలుడు స్వయంగా వస్తాడు దీర్ఘకాల అమోఘ ప్రమోదాలు, స్నేహము ఇలా తుంచివేయడని చారు ప్రతిక్షణమూ అనుకునేది. కాని ఎక్కడ వచ్చాడు! చివరికి అమే కబురుచేసింది. "కొంచెం ఆగి వస్తా" నన్నాడు. ఆ జవాబుకు చారు వరండాలోనే చతికిలపడింది. ఉదయంనుంచి మబ్బుపట్టి వుక్కబోస్తూఉంది. చారు వదులుగా వెంట్రుకలు ముడివేసుకుని, అలసతగా వుండి, విసనకర్రతో విసురుకుంటూ ఉంది. ఇలా చాలాసేపు గడిచింది. క్రమంగా చేతిలోని విసనకర్ర అలానే ఉండిపోయింది.ఆమె హృదయంలోనుంచి ఉన్నట్టుండి అధీరత, దుఃఖము, క్రోధమూ పొంగులు వారుతున్నట్టుగా ఉంది. "అమలుడు రాకపోతే, నాదేం పోయింది!" అని మనసులో అనుకుంటూ వుంది. కాని ఏమాత్రం కాలి సవ్వడి విన్పించినా, మనసు వాకిలికేసి వురకలేస్తూఉంది.

దూరాన చర్చిలో పదకొండు కొట్టారు. భూపతిబాబు స్నానంచేసి, భోజనానికి లేస్తారు. ఇంకా అరగంట వ్యవధి ఉంది. అమలు వస్తేపోను! ఎలానైనా గాని, ఇద్దరిమధ్య పేరుకున్న నీరవవైమనస్యము తుడిచివేసి తీరాలి! అతన్ని ఇలా పంపగూడదు. సమవయస్కు లయిన వదినా మరదుల మధుర సంబంధము అనేకపర్యాయాలు–అలగటం, బతిమాలటం మాటలు మానివేయటం–మళ్ళీపలకరించటం – స్నేహవుత్సా

తాలు చవిచూసింది. పవిత్ర పరామర్శతో నిర్మితమైన లతాని కుంజము ధూళిపాలు చేసి, సునాయాసంగా దూరదేశాలు వెళ్ళ గలడా? కించిత్తుకూడా పశ్చాత్తాపం కలగదా? వదినా మరదుల కన్నీటి బిందువులతో చివరిసారిగానైనా, అనును బోదెను తడపడా?

ఆ అరగంట గడిచిపోవస్తూంది. చారు జారుముడిలోని పూగుత్తి తీసి, వ్రేలికి మెలిపెడుతూ, విప్పుతూంది. యెంత ప్రయత్నించినా కన్నీరు నిలవరించుకోలేకపోయింది. అంతలో నౌకరువచ్చి 'అమ్మగారూ, బాబుగారికి వొకకొబ్బరి బొండాము కావాలి!" అన్నాడు. చారుకొంగునుంచి తాళంచెవులగుత్తి విప్పి వాడిముందు విసిరివేసింది. నౌకరు ఆశ్చర్యపడి, చెవులు తీసుకుపోయాడు. ఆమెకు దుఃఖం కంఠాగ్రమయింది.

భూపతి యథాసమయాన నవ్వుతూ భోజనానికి వచ్చాడు. చారు విసనకర్ర చేతపట్టుకుని వచ్చింది. అమలుడు కూడా వున్నాడు. ఆమె అతని మొహంకేసి చూడలేదు.
"వదినా నన్ను పిలిచావా?"

"ఆఁ, ఇప్పుడేమీ పని లేదులే!"

"అయితే వస్తాను, నేను మూటాముల్లె సర్దుకోవాలి!"

చారు దృప్తదృష్టితో అమలుని మొహంవంక చూసి— "వెళ్ళు" అంది.

అమలుడు వొకసారి ఆమెవంక చూసి వెళ్ళిపోయాడు.

భూపతి భోంచేసి, కాసేపు చారువద్ద కూర్చుంటాడు. ఇవాళ ఆతను ఎకౌంట్సుతో సతమతమవుతున్నాడు. అందు వల్ల తీరుబాటుగా కూర్చోవటానికి లేనందుకు విసుక్కుని—

"నేను యీపూట యెక్కువసేపు వుండలేను, లెక్కలు చూసుకోవాలి" అన్నాడు. "చారు వెళ్ళరాదూ!" అంది.

ఆమె అలిగిందనుకున్నాడు భూపతి. "నా వుద్దేశం నిలుచున్నపాటున బయలుదేరాలనికాదు. కొంచెం విశ్రాంతి తీసుకు వెళ్ళతాను!". చారు వుదాసీనంగా వున్నందుకు, చాల సేపు అనుతప్త చిత్తంతో, అక్కడే కూర్చున్నాడు. కాని యెలాగూ సంభాషణ రక్తికట్టలేదు యెంత ప్రయత్నించినా!

"అమలుడు రేపు వెళ్లుతాడు, కొన్నాళ్ళు నీకు బావురుమంటూ వుంటుంది.

చారు మారుమాటాడకుండానే, యేదో తేవాలనే మిషతో మరో గదిలోకి వెళ్ళింది. భూపతిబాబు కొన్ని నిమిషాలు యెదురుచూసి, తనూ బయటికి వెళ్ళాడు.

ఈ నాలుగురోజులకే అమలుడు చిక్కి, సగమయ్యాడని చారు అతన్ని చూడగానే గ్రహించింది. అతని మోము మీద తారుణ్యస్ఫూర్తి అదృశ్యమయింది. అందుకు ఆమెకు సుఖము, వెంటనే దుఃఖమూ కలిగినవి. భావి వియోగమే అతను శుష్కించిపోవటానికి మూలమని, ఆమెకు రవంతకూడా సందేహంలేదు. మరి అమలుని ప్రవర్తన ఇలావుందేమిటి? అతను దూరంగా ఎందుకు తప్పుకుతిరుగుతున్నాడు? అతను కావాలని వీడ్కోలు సందర్భాన్ని ఇంతవిముఖంగా, కటువుగా ఎందుకుచేస్తున్నాడు?

ఆమె పడుకుని యేవో ఆలోచించుకుంటూ, ఆకస్మికంగా త్రుళ్ళిపడి లేచికూర్చుంది. ఆమెకు మందాకిని తలపు కొచ్చింది. 'అమలుడు మందాకినిని ప్రేమిస్తున్నాడేమో! ఆమె

వియోగంవల్లనే అమలుడు ఇలా శుష్కించి- ఛీ! ఛీ! అమ లుని మనసు ఇంత కలుషితమైనదా, క్షుద్రమైనదా? పరిణీత మీదికి అతనిమనసుపోతుందా? అసంభవం!' సందేహవిముక్త కావటానికి శక్తికొద్దీ ప్రయత్నించింది కాని సందేహం ఆమె మనసులో గట్టిగా గూడుకట్టుకుంది.

ఇలానే అమలుడు వెళ్ళేసమయం సమీపించింది కాని మబ్బు విడిపోలేదు.

చివరికి అమలుడువచ్చి కంపించే కంఠంతో- "వదినా, నాకు బయలుదేరేటైము అయింది. యికనుంచి అన్నాయి విషయం నీవు స్వయంగా శ్రద్ధతీసుకోవాలి; చాల కష్టాల్లో వున్నాడు. నీవువినా, అన్నాయినోదార్చేవారెవరులేరు- మరో మార్గమూలేదు." అని చెప్పాడు.

అమలుడు అన్నాయి చింతాగ్రస్తుడుగా వుంటంచూసి, స్వయంగా పరిశోధించి వాస్తవస్థితిగతులేమిటో గ్రహించాడు. 'భూపతిబాబు ఎలా యేకాకిగా కష్టాలను, విపత్తులను యెదు ర్కొంటున్నాడో, యెవరివద్దనుంచి అతనికి ఎలా సహాయం గాని, చివరకు వోదార్పుగాని లభించటంలేదో, ఐనా భూపతి బాబు యీ విషమసంకటస్థితిలోకూడా తనను ఆశ్రయించు కునివున్న బంధుబాంధవులను ఎలా ఇబ్బందులపాలు గాకుండా చూస్తున్నాడో' ఆలోచించుకుని అమలుడు నిట్టూర్చాడు. తర్వాత చారువిషయం, స్వవిషయం ఆలోచించాడు. అతని మోము ఆరక్తమయింది: 'ఆషాఢచంద్రుడు, అమావాస్య ప్రకాశము'మంటగలవనివ్వు; నేను బారిష్టరునై, అన్నాయికి తోడ్పడగలిగితే ధన్యుణ్ణనుకుంటాను.

త్రాత్రంతా జాగారంచేసి, చారు ఏడో్ట్ అసందర్భంలో యేమి మాట్లాడాలో యోచించుకుంది. హాస్యపూరిత అభిమానము, ప్రసన్న ప్రేమోద్భావంతో రంగరించి ఆమె మనసు లోనే శబ్దాలను సునిశితము, సుమధురము నోర్చుకుంది. కాని తీరా సమయానికి పెదవి విప్పలేకపోయింది. "ఉత్తరాలు వ్రాస్తూ వుంటావుగదూ!" అని మాత్రం అనగలిగింది.

అమలు చారుకు సాష్టాంగప్రణామం చేశాడు. ఆమె, వొక్క వడిగున గదిలోకి వెళ్ళి తలుపు గడియ వేసుకుంది.

# 13

భూపతి వర్ధమానలో వివాహం చేయించి, అమలుని విదేశాలు ప్రయాణం చేయించి యింటికి తిరిగివచ్చాడు.

అందరితో తల బొప్పికట్టి, విశ్వాసపరాయణుడయిన భూపతి మనసులో ప్రపంచమంటే వొకవిధమైన విరక్తి కలిగింది, ఇప్పుడు అతను నలుగుర్నికలుసుకోవటం, సభలు – సమావేశాల్లో పాల్గొనటం అన్నీ యిష్టంతప్పినవి. అతను వొకొక సారి 'అన్ని విషయాల్లో ఆత్మవంచన చేసుకున్నాను. నా జీవితంలో సుఖంగా గడపవలసిన కాలం వృధాగా పోయింది. జీవితంలో వసంతకాలం బూడిదలోపోసిన పన్నీరయింది' అని వాపోయేవాడు. మరొకసారి 'పత్రిక మూలపడటంతో నాకు విముక్తి లభించింది. అన్నీ నా మంచికే!' అనుకునేవాడు. సందెవేళ మసకచీకటి ప్రారంభం కాగానే, పక్షులు గూటికి చేరినట్టు భూపతికూడా తన విహారక్షేత్రానికి స్వస్తివాచకం పలికి, అంతఃపురానికి తిరిగివచ్చాడు. 'ఇకను ఎక్కడికీ వెళ్ళను;

యిదే నాలోకం; పగలంతా విహారయాత్రలు జరిపే పత్రికా నౌక భగ్నమైంది. ఇప్పుడు యథాస్థానానికి చేరగలిగాను; విముక్తి దొరికింది' అని మనసులో అనుకున్నాడు.

భూపతిబాబు మనసులో ఒక సంస్కారం జనించుకు పోయినట్టుంది. భార్యను వశపరచుకోటానికి ప్రయత్నించ నక్కరలేదు; భార్య ధ్రువనక్షత్రం మాదిరి స్వేచ్ఛగా ప్రజ్వలిస్తూవుంటుంది. అది గాలికి ఆరదు, తైలంతో పనిలేదు; బాహ్య ప్రపంచంతో తల బొప్పి కట్టినప్పుడయినా, అంతః పురంలోకూడా యెక్కడైనా పగుళ్ళు యిచ్చాయేమో, పరిశీలించి చూద్దామనే తలపే లేదు అతనికి.

సందెచీకటి పడుతుండగా భూపతి వర్తమానంనుంచివచ్చి భోజనం ముగించుకొని తీరుబాటుగా కూర్చున్నాడు. అమలుని పెళ్ళి, విదేశయాత్రను గురించి విపులంగా వినాలని చారు కుతూహల పడుతూఉంటుందని, త్వరగా గదిలోనికి వెళ్ళాడు. గదిలో మంచంమీద పడుకుని హుక్కా గొట్టము నోట్లో పెట్టుకుని పొగ త్రాగుతున్నాడు. పనిపాటలు తెమలక కాబోలు, చారు యింతవరకు లోనికిరాలేదు. హుక్కాలో తంబాకు అయిపోయి భూపతి కునికిపాట్లు పడుతున్నాడు. మధ్యలో నిద్రాభంగమై వులికిపడి లేచి కూర్చుని, 'చారు యింకా రాలేదేమిటి' అనుకునేవాడు. చివరకు ఆతను నిబ్బరంలేక, చారును రమ్మనికబురు చేశాడు.

చారు కుతూహలంతో ప్రశ్నలవర్షం కురిపిస్తుందని భూపతి నిరీక్షిస్తున్నాడు. కాని ఆమెయేమీ అడగలేదు. అందుకు భూపతి కొంచెం దుఃఖితుడయాడు. 'చారుకు అమలుడంటే

స్నేహభావం లేదా? అమలు ఇక్కడ వున్నంతకాలమూ, అతనితో ఆడుతూపాడుతూ వుండేది. వెళ్ళిపోగానే అతనిపట్ల ఇంత ఉదాసీనత్వమా!' అని ఆలోచించసాగాడు. ఆమె విప రీత ప్రవర్తనకు అతని మనసు చివుక్కుమంది. 'అయితే చారు హృదయం గంభీరమైనదికదా! ఆమెకు తెలిసింది ఆమోద ప్రమోదాలు, ఆటపాటలేనా! ఆమె హృదయంలో స్నేహ వాత్సల్యాలకు తావులేదా? స్త్రీలు ఇలా అనాసక్తులుగా ఉండటం మంచిదికాదు.'

చారు – అమలు స్నేహానికి భూపతి చాలా సంతోష పడేవాడు. వాళ్ళ బాల్యచేష్టలు, సలహా సంప్రదింపులు, అల గటం, బ్రతిమాలటం, అన్నీ అతనికి కుతూహలం కలిగించేవి. అమలునికి ఎప్పుడేమి కావాలో తగు శ్రద్ధ తీసుకుంటున్న ఆమె సుకుమార సహృదయతకు భూపతి మురిసిపోయేవాడు.

'ఇదంతా నటనేనా! హృదయంలో స్నేహమమత్వా లకు తావేలేదా! ఆమెకు హృదయమనేది లేకపోతే, నాకింకా ఆశ్రయమెక్కడ లభించను?' అని భూపతి పరిపరి విధాల ఆలోచించసాగాడు.

భూపతి ఆమెను పరీక్షించాలని నెమ్మదిగా ప్రసంగం లోకి దించాడు. "చారూ! ఈమధ్య నీ దేహస్వాస్థ్యం బాగానే ఉంటుందికాని నీ మనసు స్వస్థతగా వున్నట్టులేదే!" అన్నాడు

"లేదు, బాగానేవుంది" అన్నది ముక్తసరిగా.

"అమలుని పెళ్ళి జరిగిపోయింది–"అని చెప్పి, భూపతి వూరుకున్నాడు. ఆమె సమయోచితంగా మాట కలపాలని

ప్రయత్నించింది కాని నోటమాటరాక, స్థాణువుమాదిరి మెదల కుండా కూర్చుంది.

భూపతి ఏ విషయాన్నీ అంతగా పట్టించుకోడు. కాని అమలుని యెడబాటుకు అతని మనసు ఖేదపడింది. అందువల్ల చారు ఉదాసీనతకు అతను నొచ్చుకున్నాడు. తన మాదిరే వ్యధ చెందుతున్న చారుతో అమలుని విషయం మాట్లాడి, హృదయభారాన్ని తగ్గించుకోవాలని అతని సంకల్పం. "పిల్ల అందంగావుంది-చారూ, నిద్రపోతున్నావా ?"

"పాపం అమలు వొంటరిగా వెళ్ళాడు. రైల్లోకూర్చోగానే, పిల్లలమాదిరి వెక్కి వెక్కి యేడ్చాడు. అది చూసి ఈ వృద్ధాప్యంలో నేనూ కన్నీరు ఆపుకోలేకపోయాను. అదే పెట్టెలో కూర్చున్న తెల్లవాళ్ళకు పురుషులు కంటతడిపెట్టటం అబ్బురంగా వుంది!"

చారు దీపం పెద్దదిచేసి, మంచంమీద పక్కకు వొత్తిగిలి పడుకుంది. తర్వాత అకస్మాత్తుగా లేచి, బయటికి వెళ్ళింది. భూపతి త్రుళ్ళిపడి,-"వొంట్లో యేమీ బాగాలేదా చారూ!" అని అడిగాడు.

యేమీ సమాధానంరాక, దగ్గరవరండాలో కుమిలి యేడుస్తున్న శబ్దంవిని, ఆదరాబాదరా పరుగెత్తుకుంటూ వచ్చాడు. చారు గచ్చుమీద బోర్లా పడుకుని పొంగి పొరలే దుఃఖాన్ని నిగ్రహించుకోటానికి ప్రయత్నిస్తూంది. ఆశోకోద్వేగం చూసి, భూపతి నిర్విణ్ణుడయాడు. "చారును నేను సరిగా అర్థం చేసుకోలేదా! ఆమె నావద్దకూడా హృదయవేదన వెలిబుచ్చటానికి యిష్టపడలేదు! ఆమె స్వభావం అంత గంభీర

మైనదా? యిలాంటివారి ప్రేమతోపాటు వారి వేదనకూడ అత్యధికమైనది కావచ్చు!" భూపతిబాబు లోలోపల బాగా ఆలోచించుకుని, సాధారణ స్త్రీలమాదిరి చారు ప్రేమ బయటికి పొంగేదికాదని అర్థంచేసుకున్నాడు. పూర్వమెన్నడూ ఆమెలో అంతటి ప్రేమోద్వేగాన్ని చూడలేదు. ఆమె ప్రేమ స్రోతస్సు ఆంతరంగికమైనదని యివాళ విస్పష్టంగా బోధపడింది. స్వతహా భూపతి ప్రేమ వ్యక్తపరచటంలో నిపుణుడు కాదు. అందువల్ల భార్య స్వభావంలో కూడా, గంభీరమైన ఆంతరంగిక హృదయావేగం వున్నదని గ్రహించి, అతనికి వొకవిధమయిన సంతృప్తి కలిగింది.

భూపతి చారువద్ద కూర్చుని, నెమ్మదిగా ఆమెశరీరం నిమరసాగాడు. ఆమెను యెలా వోదార్చాలో అతనికి తెలియదు. యెవరైనా అంధకారంలో శోకం దిగమ్రింగాలనుకునేటప్పుడు, అక్కడ మరోసాక్షి వుండటం, వారికి రుచించదని మాత్రం భూపతికి తోచలేదు.

## 14

భూపతి పత్రికకు వుద్వాసనచెప్పి, భావిపథకం వొకటి మనసులో రూపొందించుకున్నాడు. యెలాంటిదురాశలకులోను కాగూడదు; చారు చదువుసంధ్యలతో, అచ్చట ముచ్చట్లతో, గార్హస్థ్య ధర్మనిర్వహణలో జీవితం వెళ్లబుచ్చాలనిమనసులో ప్రతిజ్ఞ చేశాడు 'గార్హస్థ్యసుఖము సుకరము,మధురమైనది' నిత్యనూతనమెకాకపవిత్రము,నిర్మలమూఅయినది అది ఆసహాజ ప్రాప్తసుఖంతోనే నా జీవితగృహంలో వొక మూల సందె

దీపం వెలిగించి, అఖండ శాంతివాతావరణం సృష్టించు కుంటాను.' అని ఆలోచించుకున్నాడు. సరస సల్లాపాలు, హాస్యాలాపాలు, కులాసాకబుర్లు – వీటికి పెద్ద ప్రయత్నమేమీ అక్కరలేదని భావించాడు. కాని తీరా సమయానికి ఆ సుఖం అనుకున్నంత తేలికగా లభించేదికాదని తెలిసింది. వెల చెల్లించి కొన వీలులేని వస్తువు, అప్రయత్నంగా లభిస్తే తప్ప, మరో విధంగా సాధించగలగటం దుర్లభం!

చివరికి భూపతి, ఎలానూ చారుతో ఆత్మీయతను పెంపొందించుకోలేకపోయాడు; అందుకు తానే దోషినని నిర్ణయించుకున్నాడు. పది పన్నెండుసంవత్సరాలపాటు సంపాద కీయాలు వ్రాస్తూ, భార్యతో ఎలా సంభాషించాలోకూడా మరిచిపోయే దుస్థితిలోపడ్డాడు. సందెదీపాలు పెట్టగానే అతను వనిమాల యింటికి చేరుకున్నాడు. దంపతులు ముక్తసరిగా ఒకటి రెండు మాటలు మాట్లాడుకుంటారు కాని తర్వాతి విషయం ఎవరికేమీ పాలుబోవటంలేదు. తనచేతకానితనానికి, భార్య యెదట చాల సిగ్గుపడేవాడు. భార్యతో కులాసాగా కబుర్లుచెప్పటం యెంత తేలిక అనుకున్నాడో, ఇప్పుడు అంత కష్టంగా తోచింది! ఇంతకంటె, సభల్లో ప్రసంగించటం చాల సులువు!

దీపాలుపెట్టినాక, సరససల్లాపాలతో ప్రొద్దుపుచ్చాలని సంకల్పించుకున్నకాలం గడపటం, ఒక సమస్యగా తయారై కూర్చుంది. కొంచెంసేపు ప్రయత్నించి, మౌనంగా కూర్చుని యిక్కడనుంచి లేచివెళ్ళటం ఉత్తమం అనుకునేవాడు. కాని వెళ్ళిపోతే చారు ఎలా అర్థంచేసుకుంటుందోనని కదలలేక

పోయేవాడు. అకస్మాత్తుగా 'పేక ఆడదామా?' అనేవాడు. చారు మార్గాంతరంలేక, తలయెగరవేసి యిష్టంలేకపోయినా పేకతెచ్చేది. ఆమె మాటమాటకూ తప్పుఆడి, ఓడిపోయేది. యిలా పేకాట యెవరికీ సంతోషం కలిగించేదికాదు.

భూపతి తీవ్రంగా ఆలోచించి ఒకనాడు—"చారూ! నీవు జొత్తిగా ఒంటరిదానివి అయావు. మందాకినిని పిలిపిద్దామా?" అన్నాడు.

ఆపేరు చెవినిపడగానే, చారుకు చుర్రుమంది. "వద్దు, ఆమెతో నాకేమీ అవసరంలేదు."

ఆమె జవాబుకు భూపతి నవ్వి, సంతుష్టుడయాడు. లోలోపల! సతీసాధ్వీలు, సతీధర్మ మర్యాదను యేమాత్రం అతిక్రమించటం జరిగినా, ఓర్పువహించలేరని అనుకున్నాడు.

చారు మొదటి విద్వేషతరంగము శాంతించినతర్వాత, 'ఒకవేళ మందాకిని వారిని కొంతవరకు ప్రసన్నుల్ని చేయగలదేమో!' ననుకుంది. భర్తవాంఛించే మానసికసుఖం చేకూర్చ లేకపోతున్నందుకు, ఆమె చాలఖేదపడుతూవుంది. భర్తబాహ్య ప్రపంచంతో సంబంధం తెంచుకుని, సమస్తజీవితానందం తన నుంచే పొందాలని ప్రయత్నిస్తున్నారు; వారి తదేకనిష్ఠకు, తన హృదయదైన్యానికి ఆమె అకస్మాత్తుగా భీతిల్లింది. 'ఇలా ఎంత కాలం సంసారం దొర్లుతుంది? వారు మరో వ్యాసంగం ఎందుకుకల్పించుకోరు? మరోపత్రిక పెట్టకూడదూ!' అని ఆలోచించేది. నిజానికి వారిమనసు రంజింపచేయటానికి ఏమీ అభ్యసించనక్కరలేకపోయింది; భర్తయేవిధమైనపరిచర్యను, సుఖాన్ని తననుంచి ఆశించలేదు. అలాంటి అవసరానికి అనుగుణ్యంగా

నైనా ఎప్పుడూ తనను తీర్చిదిద్దలేదు. ఇవాళ వారు ఆకస్మి కంగా తన అవసరాలన్నీ చారుద్వారా తీర్చుకోవాలనుకుంటు న్నారు. యిలాంటిస్థితిలో ఆమెకు అంతా అయోమయంగా వుంది. భర్తకు ఏమికావాలో, ఎలా వారికి సంతృప్తి కలుగు తుందో, ఆమెకు సరిగా తెలియలేదు. ఒకవేళ తెలిసినా, ఇప్పుడు అది ఆమెశక్తిని మించిపోయింది.

భూపతి నెమ్మదిగా ఒకొక అడుగు ముందుకువస్తే చారుకు ఇంత కఠిన సమస్యగా తయారయేది కాదేమో! కాని అతను వొక్కరాత్రే దివాలాతీసి, రిక్తభిక్షుపాత్ర ఆమె ఎదుట వుంచాడు. అప్పుడు ఆమె చాల అసమంజస స్థితిలో పడి పోయింది.

"సరే, మందాకినిని పిలిపించండి; మీ పరిచర్యలకైనా కొంతసులువుగా వుంటుంది."

భూపతి నవ్వి—"నా పరిచర్యలకా! నాకు మరెవరితో పనిలేదు చారూ!" అన్నాడు.

"నేను వట్టి నీరస జీవిని, చారును ఏవిధంగానూ సుఖ పెట్టలేక పోతున్నాను" అనుకుని దుఃఖితుడై, భూపతిబాబు సాహిత్యచర్చలో నిమగ్నమయాడు. మిత్రులెవరైనా వచ్చి, అతను బంకించంద్రుడు, టెన్నిసను, బైరను యిత్యాదుల గ్రంథాల్లో తలమునక లవటంచూసి విస్తుపోయేవారు. మిత్రులు ఈ అకాల కావ్యప్రేమకు యెగతాళి చేసేవారు! భూపతి నవ్వి—"వెదురుకూడా పుష్పిస్తుంది కాని ఎప్పుడు పుష్పిస్తుందోమాత్రం చెప్పలేము!" అనేవాడు!

భూపతి ఒకనాడు గదిలో దీపం వెలిగించి, చాల సంకో చిస్తూ "ఏదైనా చదివి విన్పించనా!" అన్నాడు చారుతో.

"విన్పించండి!"

"ఏమి విన్పించేది!"

"మీ యిష్టం!"

ఆమెకు అంత ఆసక్తి లేనందుకు భూపతి మనస్సు తరుక్కుపోయింది. అయినా, అతను ధైర్యంచేసి—"టెనిసను కవిత్వం అనువదించి విన్పిస్తాను" అని చెప్పాడు.

కాని, అంతా వృథా అయింది. సంకోచంతో, నిరు త్సాహంతో కావ్యపఠనం కుంటుపడసాగింది; ఆమెకు విప్పి చెప్పడానికి సరియైన శబ్దాలుకూడా సమయానికి తలపుకు రాలేదు. చివరికి చారు శూన్యదృష్టి గమనించి, ఆమె అన్య మనస్కంగా వుందని అర్థంచేసుకున్నాడు. దీపకాంతితో విల సిల్లుతున్న ఆ గదిలో, ఆ ఏకాంత రాత్రి సమయాన కావల సినంత నిండుదనం రాలేదు.

భూపతివల్ల ఇలాంటి పొరపాటులే ఒకటి రెండుసార్లు జరిగినవి. చివరికి భూపతి భార్యవద్ద సాహిత్యప్రసంగం కేవలమే విరమించుకున్నాడు.

# 15

గట్టిగా దెబ్బతగిలినప్పుడు, నరాలు మొద్దుబారుతవి. అప్పుడు నొప్పికూడా అనిపించదు; అలాసే అమలుడు లేని లోటు చారు అనుభవానికి రాలేదు మొదట్లో! కాని రోజులు గడచినకొద్దీ, జీవితం క్రమంగా శూన్యంగా తోచసాగింది.

ఈ దారుణ సౌన్యత్వం అవగతంకాగానే, ఆమె హతబుద్ధి మాదిరి అయింది. బృందావనంనుంచి ఈ యెడారిలో వచ్చి పడ్డానేమిటి అని ఆలోచించసాగింది. కాలచక్రం తిరుగుతున్న కొద్దీ, యెడారి వైశాల్యం పెరుగుతూనే వుంది. యిదివరకు యెడారి వున్నదనికూడా తెలియదు. నిద్రాభంగం కాగానే, గుండె ఆగినంతపని జరుగుతుంది - మొదట తలపుకొచ్చేది అమలుడు లేడని! హృదయం వరండాలో ఆకూ వక్కలు ముందుపెట్టుకు కూర్చున్నప్పుడు, అమలుడు వెనకనుంచి రాడుగదా అని ప్రతిక్షణమూ అనుకునేది. అప్పుడప్పుడు పరాకుగా వొకకట్ట ఆకులకు ఈనెలు తీసేది. కాని హఠాత్తుగా తాంబూలం యెక్కువగా సేవించే మనిషి లేడని జ్ఞప్తికివచ్చేది. భాండాగారంలో అడుగుపెట్టగానే, అమలునికోసం ఫలహారం విడిగా తీసివుంచనక్కరలేదని గుర్తుకొచ్చేది. ఆమె మనసులోని అధీరత అంతఃపురంలో ప్రవేశించి, ఇవాళ అమలుడు కాలేజి నుంచి రాడని తలపుకు తెచ్చేది. నవీనగ్రంథం, నవీన రచన - యెవరివద్దనుంచీ ఆశించడానికే వీలులేదు. అల్లికపనిలేదు, రచనావ్యాసంగంతో పనిలేదు. విలాసవస్తువులుకూడా తెప్పించి వుంచవలసిన పనిలేదు. ఆమెకు!

చారు యీ దుర్భర కష్టానికి, చాంచల్యానికి విస్తుపోయింది. అవిశ్రాంత మనోవేదనా భారానికి ఆమె భయపడసాగింది. "నాకు యెందుకు ఇంత దుఃఖం కలుగుతూవుంది? అమలుడు నాకు యేమంత దగ్గరబంధువు, సేనింత బాధపడటానికి? దాసదాసీలుకూడా నిశ్చింతగా కాలం గడుపుతారు. నాకు ఈ దుస్థితి యేమిటి? ఆ పరమాత్ముడు నన్నెందుకు

ఇలా ఆత్మవంచలపాలుచేశాడు ?" అని ప్రశ్నించుకుని, అబ్బురీ పడుతుండేది. కాని ఆమె దుఃఖం లవలేశమూ తగ్గలేదు. అమలుని స్మృతి, ఆమె బాహ్యాభ్యంతరాలలో పరివ్యాప్తమై, ఆమెకు యెక్కడా సుఖమనేది లేకుండా చేసింది.

న్యాయానికి భూపతిబాబు ఆమెను అమలుని స్మృతికి గురికాకుండా చూడవలసింది. కాని ఆ స్నేహశీలి వియోగ వేదనాకులుడై పదేపదే అమలుని జ్ఞప్తికి తెచ్చేవాడు. చివరికి ఆమె చుక్కాని గాలికి విడిచిపెట్టింది. అంతర్ద్వంద్వానికి స్వస్తి చెప్పి, నిర్విరోధంగా పరాజయాన్ని స్వీకరించింది. అమలుని స్మృతి సమాదరంగా హృదయంలో ప్రతిష్ఠించుకుంది. క్రమంగా యేకాగ్రచిత్తంతో అమలుని ధ్యానే కాణాచి అయింది. అతనిస్మృతే జీవితంలో మహా అభిమానపడవలసిన విషయమయింది. యింటిపనులు తెమలగానే దీనికొకవేళ నిర్ణయించుకుంది. గదిలో యేకాంతంగా తలుపులు బిగించుకుని అమలునితో సంబంధం వున్న సంఘటనలన్నిటినీ తలపోసేది; ఒకసారి దిండుమీద బోర్లా పడుకుని అమలుని పలవరించేది. సుదూర ప్రాంతంనుంచి "యేమిటి వదినా!" అని పలకరించి నట్టుండేది. చారు అశ్రుసిక్త నిమీలిత నేత్రాలతో 'అమల్, నీవు కోపంతో ఎందుకు వెళ్ళావు? నావల్ల నేమీ నేరంలేదు. నీవు చిరునవ్వుతో చెప్పివెళ్ళితే నేను ఇంతదుఃఖానికి గురి అయేదాన్ని కాదేమో!' నని చెప్పేది. అమలుడు యెదట వుంటే ఎలా మాట్లాడేదో, సరిగా అలానే మాట్లాడేది. 'అమల్! నిన్ను నేను ఒక్కనాటికీ మరవలేను, క్షణక్షణమూ నా స్మృతిపథంలో మెదులుతున్నావు. నా జీవితంలోని శ్రేష్ఠ

వస్తువులు వికసింపజేసిందినీవే! నాజీవితంలోని వుజ్వలభాగంతో ప్రతిదినమూ నిన్నే పూజిస్తుంటాను.'

చారు ఇలా సమస్త గృహస్థధర్మాల అధోభాగంలో ఒక సొరంగంతవ్వి ఆ నిరాలోక, నిస్తబ్ధ అంధకారంలో అశ్రుమాలా శోభితమైన గుప్తశోకానికి ఒక రహస్యమందిరం నిర్మించుకుంది. అక్కడ తనభర్తకేకాదు. ప్రపంచంలో ఎవరికీ ప్రవేశించేహక్కులేదు. ఆ తావు యెంత గోప్యమైనదో అంత గంభీరమైనది, ప్రియమైనదీను! ఆమె ఈ విధంగా సంపూర్ణ ప్రాపంచిక ఛద్మవేషాన్ని త్యజించి, తన రహస్యమందిరంలోనికి నిరావృత ఆత్మస్వరంతో ప్రవేశించేది. అక్కడినుంచి వెలికి రాగానే మళ్ళీ ఛద్మవేషాన్ని ధరించి, ప్రాపంచిక హాస్యాలాపాల్లో కర్మకాండలో పాల్గొనేది.

# 16

చారు యిలా మనస్సుతో వివాదపడటం మాని, తన ఈ గంభీర విషాదంలో కూడా ఒకవిధమైన ప్రశాంతి పొందింది. తదేకనిష్ఠతో భర్తకు పరిచర్యలుకూడా చేస్తూవుంది. భూపతి నిద్రించేటప్పుడు, ఆమె నెమ్మదిగా అతని పాదాలవద్ద శిరస్సువుంచి, పాదధూళి పాపట్లో అద్దుకునేది. భర్త సేవా శుశ్రూషల్లో కుటుంబ నిర్వహణలో మునిగితేలుతూ కూడా, అతని చిన్నచిన్న అవసరాలను యేమరి వుండేదికాదు. బంధువుల పట్ల, ఆశ్రితులపట్ల యేమాత్రం వుపేక్షజరిగినా, భూపతిబాబు దుఃఖితులవుతారని రవంతలోటు రానిచ్చేదికాదు. యిలా

స్వయంగా పనులన్నీ చేసుకుని, భర్త వృచ్ఛిష్ట ప్రసాదంభుజించి కాలం వెళ్ళబుచ్చుతూ వుంది.

ఈ సేవా శుశ్రూషలతో భూపతికి నవయవ్వనం తిరిగి ప్రాప్తించినట్టుంది; చారుతో ఇంతకాలానికి కొత్తగా వివాహమయినట్టుగానూవుంది. హాసపరిహాసాలతో, అలంకరణాలతో అతను ప్రసన్నుడై ప్రావంచిక దుశ్చింతలన్నింటినీ పక్కకు త్రోసివేశాడు. జబ్బుపడి లేచిన వ్యక్తికి ఆకలి పెరిగిన మాదిరి శరీరంలో భోగశక్తి, వికాస జ్ఞానము, అనుభవం కాసాగిన రీతిగానే, భూపతి మనసులోకూడా యింత కాలానికి వొక అపూర్వ ప్రబల భావోద్రేకం కదలబారింది. అతను మిత్రులకు – చివరికి చారుకుకూడా తెలియకుండా కవిత్వపఠనం ప్రారంభించాడు. "అష్టకష్టాలకు గురిఅయి, పత్రిక మూసివేసి ఇంతకాలానికి భార్యను పొందగలిగాను" అని మనసులో అనుకోసాగాడు.

భూపతి వొకనాడు–"చారూ, ప్రస్తుతం నీ నేమీరా వ్రాయటం లేదేం?" అని అడిగాడు.

"నేను మహా వ్రాయగలనుగదూ!"

"నిజంగా చారూ, ఆధునిక రచయితల్లో నీమాదిరి చక్కని భాష బహుకొద్దిమంది వ్రాయగలరేమో! 'విశ్వబంధు' వెలిబుచ్చిన అభిప్రాయంతో నేను నూటికి నూరుపాళ్ళూ యేకీభవిస్తా"

"చాల్లెండి, ఎవరైనా వింటే నవ్విపోతారు!"

"ఇదుగో చూడు" అంటూ 'సరోరుహ' ప్రతి ఒకటితీసి భూపతిబాబు, అమలుడు–చారు శైలినిపోల్చి చెప్పసాగాడు.

చారు మోము ఎఱ్ఱవారి, భూపతి చేతిలోనుంచి ఆ వ్రతికి లాక్కొని చీరచెరగుమాటున దాచింది. "తోడుతేనిదే వ్రాత సాగదు, నెమ్మదిగా నేనూ అలవాటు చేసుకుంటాను. అప్పుడు గాని చారుకు ఉత్సాహం కలగదు" అని భూపతి ఆలోచించు కున్నాడు. అతను చాలా గోప్యంగా రచనా వ్యాసంగానికి ఉపక్రమించాడు. నిఘంటువు దగ్గరపెట్టుకుని, చీటికి మాటికి కొట్టివేసి, మళ్ళీవ్రాస్తూ నిరుద్యోగావస్థను ఎలాగో వెళ్ళ బుచ్చుతున్నాడు. ఇంత శ్రమపడుతున్న ఫలితంగా తన రచ నలమీద తనకే నమ్మకం, మమత్వం పెంపొందసాగింది. తరు వాత ఒకనాడు తనరచన ఎవరిచేతనో కాపీచేయించి, నవ్వుతూ చారు చేతికి ఇచ్చి—"నా మిత్రుడొకడు క్రొత్తగా వ్రాస్తు న్నాడు, నాకేమీ తెలియదాయె, ఒకసారి చదివి చూడు ఎలావుందో!" అని, భయ సంభ్రమాలతో బయటికివెళ్ళాడు. చారు తత్‌క్షణమే సరళహృదయుడైన భర్త నాటకం గ్రహిం చింది!

చారు పేజీలు తిరగవేసి చూచింది. విషయము, శైలి చూసి కొంచెం నవ్వొస్తుంది. "ఇంతగా భర్తకు పరిచర్యలు చేస్తున్నప్పటికీ, వారు పసిపిల్లల మాదిరి, నేను సమర్పించుకునే అర్ఘ్యాన్ని తోసివేస్తున్నారెందుకు? తన ముఖతః ప్రశంస వినాలని ఈ ఆర్భాటమేమిటి? వారు తన మనసును ఆకర్షించ టానికి ప్రయత్నించకుండా ఉంటే, భర్తను పూజించటం తనకు సులభమయేదేమో!" భూపతిబాబు తనను ఎందులోను ఆమెకంటె తక్కువగా భావించకూడదని చారు సంకల్పం!

చారు ఆ రచన మడిచి, గుప్పిట్లో గట్టిగా పట్టుకుని దిండుకు ఆనుకుని దూరంగా చూస్తూ, ఆలోచనా ప్రవాహంలోపడి కొట్టుకుపోయింది. అమలుడూ ఇలానే నూతన రచనలు చదవమని యిచ్చేవాడు.

మరచిపోయి ఉన్న తర్వాత భూపతిబాబు పడకగదికి ఎదురుగా ఉన్న వరండాలో పూలకుండీలు చూస్తున్నాడు. ఆమెను రచన సంగతి హెచ్చరించటానికి ధైర్యం చాలలేదు. చివరికి చారు తనే మాట్లాడింది. "ఇది మీ మిత్రుని తొలి రచనా?"

"అవును!"

"చాల చక్కగా వ్రాశారు. ఎక్కడా తొలి రచన అనిపించలేదు."

భూపతిబాబు చాలప్రసన్నుడై —"మారు పేరుతో వున్న ఈ రచనమీద తన ముద్ర ఎలా పడాలా?" అని ఆలోచించసాగాడు. క్రమంగా అతని రచనలతో పుస్తకాలు నిండిపోతున్నవి. పేరు ప్రకటించుకోవటానికికూడా ఎక్కువ రోజులు పట్టలేదు.

# 17

ఏ దేశాలనుంచి యే తారీఖు వుత్తరం వస్తుందో, చారు బాగా గుర్తుపెట్టుకునేది. మొదట ఏడెన్‌నుంచి, తర్వాత సూయజ్‌నుంచి భూపతిపేర వుత్తరం వచ్చింది. అమలుడు 'వదిన'కు నమస్కారాలు చెప్పాడు. మాల్టానుంచి వ్రాసిన వుత్తరంలో నమస్కారాలు చెప్పాడుకాని ఆమెపేర వొక్క వుత్తరంకూడా వ్రాయలేదు. చివరికి భూపతివద్దనుంచి వుత్తరా

లన్నీ తీసుకుని, వొకటికి రెండుసార్లు చదువుకుంది. కాని యెక్కడా 'నమస్కారాలు' మినహా, మరొక మాటకూడా లేదు.

చారు ఈ మధ్య కొన్నాళ్ళనుంచి, తాను ఆశ్రయం పొందిన ప్రశాంత విషాద చందువా, అమలుని వుపేక్షతో బొత్తిగా ఛిన్నాభిన్నమై పోయింది. మళ్ళీ ఆమె హృదయంలో వొకవిధమైన ద్వంద్వం బయలుదేరింది. గృహస్థ ధర్మనిర్వాహణలో మళ్ళీ భూకంపంమాదిరి కల్లోలం ప్రారంభమయింది.

భూపతి వొకొకరోజు అర్ధరాత్రి లేచిచూస్తే, చారు మంచంమీద కన్పించేదికాదు. వెదికితే, ఆమె దక్షిణపువేపు తెరచిన కిటికీవద్ద కూర్చునివుండేది! భూపతిబాబును చూడగానే లేచి - "ఇవాళ చాల వుమ్మరంగా వుంది; చల్లగాలికి యిటువచ్చి కూర్చున్నాను!" అని చెప్పేది.

భూపతిబాబు వుద్విగ్నుడై మంచంవద్ద పంకా లాగించే ఏర్పాటుచేశాడు; అప్పటినుంచి ఆమె ఆరోగ్య విషయంకూడా చాలా జాగ్రత్తతీసుకోసాగాడు. చారు నవ్వి - "నేను చాల బాగావున్నాను, మీరు వృథాగా బెంగపెట్టుకుంటారు దేనికి?" అనేది. యీమాత్రం నవ్వుతెచ్చుకోటానికికూడా చారు తన మనోబలాన్నంతా కూడదీసుకోవలసివచ్చేది!

అమలు విదేశం చేరాడు. దారిలో విడిగా తనకు వుత్తరం వ్రాయటం కుదరలేదేమో, స్టీమరు దిగీ దిగటంతో, తనపేర పెద్ద వుత్తరం వ్రాస్తాడని చారు ఆశించింది. కాని ఆ సూచనలేమీ పొడకట్టటంలేదు!

విదేశీ టపా వచ్చేనాడు, యింటిపనులు చూసుకుంటూ తలుగురితో మాట్లాడుతూనే మనసులో విలవిలలాడి పోతుం డేది. నీపేర యేమీ రాలేదని యెక్కడ వినవలసివస్తుందోనని భూపతిబాబును అడగటానికి సాహసించలేకపోయేది !

టపా వచ్చేనాడు, ఒకసారి భూపతిబాబు పెళ్ళినడకతో లోనికి వచ్చాడు. చారు విచిత్ర మనఃస్థితిలో వుంది. అతను ముసిముసి నవ్వులు నవుతూ – "నేనొక వస్తువు తెచ్చాను; చూడూ !" అన్నాడు చారుతో !

ఆమె శరీరం పులకించి త్రుళ్ళిపడింది. చాల సంభ్ర మంతో – "యేదీ చూద్దాము !" అంది.

భూపతి ఆవస్తువేమిటో చూపకుండా సరససల్లాపాలతో నూతన దాంపత్యసుఖం ఆస్వాదించాలని ప్రయత్నించాడు. చారు అధీరురాలై, భూపతి ఉత్తరీయం చాటున దాచుకున్న వస్తువును లాక్కోవాలని ప్రయాసపడుతూంది. "ఇవాళ తప్పక ఉత్తరం వస్తుందని నా మనసు ఉదయంనుంచీ చెప్పేది వృథా అవుతుందా ?" అని లోలోపల అనుకోసాగింది. భూపతిబాబు ఆ సరస వాతావరణం అలానే ఉంచాలనే సంకల్పంతో ఆమెకు అందకుండా మంచంచుట్టూ తిరగసాగాడు. చారు అతన్ని వెంబడిస్తూవుంది. చివరకు ఆమె అలసిపోయి, కోప గించుకుని మంచంమీద చతికిలబడింది. నేత్రాలు చెమ్మగిల్లినవి. ఆమె తీవ్ర కుతూహలానికి అతను చాల సంతుష్టుడై తన రచన నొకటి చప్పున ఆమె వొడిలో వేసి–"ఇదుగో తీసుకో, కోప గించవద్దు !" అన్నాడు.

# 18

చదువు ప్రారంభించటంవల్ల కొన్నాళ్ళదాకా ఉత్తరాలు వ్రాయటానికి అవకాశముండదని అమలుడు భూపతికి వ్రాశాడు. కాని వొకటి రెండు టపాలలో ఉత్తరమేమీ రాక పోయేటప్పటికి, చారుకు సంసారం ముళ్ళపాన్పుగా తోచింది. సందె వేళ భూపతి రాగానే, మాటలమధ్య చారు ఉదాసీనంగా శాంతస్వరంతో—"టెలిగ్రాము ఇచ్చి అమలుడు ఎలావున్నాడో తెలుసుకోకూడదూ !" అంది.

"రెండువారాల క్రితమేగదా స్టడీసు మొదలెట్టాలనీ, ఉత్తరాలువ్రాసే వ్యవధి వుండదనీ అతని దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది !"

"సరే పోనివ్వండి! కాని తావు; ఏమైనా సుస్తీ చేసిం దేమో వనుకున్నాను. ఎలానమ్మటం !"

"అదికాదు, జబ్బుచేస్తే తెలియజేసేవాడే ! టెలిగ్రాముకు చాల డబ్బవుతుంది !"

"చాలడబ్బు అవుతుందా యేమిటి ? నేను యే రెండు మూడు రూపాయలో సరిపోతవనుకున్నాను."

"కాదు కాదు. వచ్చకాగితానికి తక్కువకాదు !"

"అయితే కష్టమే !"

చారు రెండురోజులు గడిచినాక—"మా చెల్లెలు ఇంకా 'చూంచడా'లో వుంది. మీరు వొకసారి వాళ్ళని పలకరించి వస్తే బాగుంటుంది" అని చెప్పింది భూపతితో.

"ఏం జబ్బుగావుందా ?"

'కాదు, జబ్బు చేయటంకాదు. మీరు అక్కడికివెళ్ళి చూసివస్తే వాళ్ళు ఎంతసంబరపడతారో మీకు తెలియదూ?"

చారు బలవంతంమీద, భూపతి బండి చేసుకుని స్టేషనుకు బయలుదేరాడు. దారిలో బండ్లు నిలిచి సందులేకుండా వున్నవి. అందువల్ల చాలసేపు బండి కదలలేదు. అంతలో అతన్ని ఎరిగిన టెలిగ్రాఫు ప్యూను అటువెళ్తూ చూసి భూపతి బాబు పేర వచ్చిన టెలిగ్రాము యిచ్చాడు! ఫారెన్ టెలిగ్రాము చూసి, భూపతి గుండె దడదడ లాడింది. అమలుడు జబ్బుపడ్డాడేమోనని భయపడుతూ చదివాడు "నేను క్షేమంగా వున్నాను" అర్థమేమిటి? తిప్పి చూశాడు. జవాబుకు డబ్బు కట్టిన టెలిగ్రాము!

భూపతి బండి వెనక్కు తిప్పించి, ఇంటికివచ్చి టెలిగ్రాము భార్య చేతికి యిచ్చాడు. టెలిగ్రాము చూసీ చూడగానే ఆమె మోము వెలవెలపోయింది. "దీనికి అర్థమేమిటో? నాకేమీ తోచటంలేదు" అన్నాడు భూపతి.

భూపతి పరిశోధనచేసి, వివరాలన్నీ సేకరించాడు. చారు తన నగ తాకట్టుపెట్టి ఆ డబ్బుతో టెలిగ్రాము చేసింది. "ఇంత యిదేమివచ్చింది? మరొకసారి చెపితే, నేను టెలిగ్రాము చేసేవాణ్ణికదా! పరిచారకులద్వారా నగ బజార్లో కుదవబెట్టటం, మంచిపని కాదు." మాటి మాటికీ అతని మనసులో మరో ప్రశ్న వుదయించేది "చారు ఎందుకింత అవివేకంగా ప్రవర్తించింది?" ఒక అస్పష్టమైన సందేహం అజ్ఞాతరూపంగా అతని హృదయాన్ని పీడించసాగింది. ఆ సందేహం

ప్రత్యక్షంకావటం యిష్టంలేక, మరవటానికి ప్రయత్నించాడు. కాని ఆ వేదన అతన్ని వెన్నాడుతూనేవుంది.

# 19

అమలుని ఆరోగ్యం బాగాఉన్నప్పటికీ, అతను ఉత్తరం వ్రాయడంలేదు. ఇంతదారుణంగా అన్యోన్యతకు ఎలా భంగం కలిగింది. ఆమెకు స్వయంగా వెళ్ళి, ముఖాముఖిని అడిగి తెలుసుకోవాలనివుంది. కాని మధ్యలో పెద్ద అడ్డంకివుంది సముద్రం. దాటిపోయే దెలా? నిష్ఠురము నిరుపాయమైన విచ్ఛేదము! సమస్తప్రశ్నలకు, ప్రతిక్రియలకు అతీతంగావుంది ఈ విచ్ఛేదము! చారు తనను సంబాళించుకుని, స్థిమితపడలేకపోయింది. ఇంటిపనులు మూలపడసాగినవి. దాసదాసీలు చేతికి అందిన వస్తువులు ఎత్తుకెళ్ళుతున్నారు. ఆమె దైన్యంచూసి నలుగురూ గుసగుసలాడుతున్నారు. బయట ఇంతజరుగుతున్నా, ఆమె మనలోకంలోలేదు. చారు రానురాను అకస్మాత్తుగా త్రుళ్ళిపడేది. మాట్లాడుతూనే మధ్యలోలేచి, ఏకాంతంగా కూర్చుని కన్నీరుకార్చేది. ఎవరైనా ఆమెఎదట, అమలుని ప్రసక్తితెస్తే చాలు, మొహాన నెత్తురుచుక్క ఉండేదికాదు.

భూపతిబాబు యిదంతా గమనించకపోలేదు. కల్లో కూడా ఊహించరాని విషయం ఆలోచించవలసి వచ్చింది. ప్రపంచము అతనికి జీర్ణ, శుష్కవృద్ధునిమాదిరిగా తోచసాగింది.

ఆనందోన్మేషంలో కళ్ళు మూతలుపడిన కొద్దిదినాలు

తలపుకువచ్చి, భూపతిబాబు సిగ్గుపడిపోతున్నాడు. అభంశుభం తెలియనివానరం రత్నాన్ని గుర్తించలేదని, శిలాఖండంతో దానిని వంచించటం న్యాయమా? భూపతిబాబు ఇప్పటిదాకా మైమరచిన చారుమాటలు, ప్రేమకలాపాలే ఒక్కొకటే గుర్తుకు వచ్చి, అతన్ని 'మూర్ఖుడా' అని కొరడావాతలు పెడుతు న్నట్టుంది.

అతనికి హఠాత్తుగా తాను కష్టపడి వ్రాసిన రచనలు జ్ఞప్తికివచ్చి, భూదేవిని ప్రార్థించాడు! అంకుశతాడితమత్తేభం మాదిరి, ఆదరాబాదరా చారువద్దకు పరుగెత్తి- 'నా రచనలు యేవి?' అని అడిగాడు. చారు 'నావద్దఉన్నవి.' అని చెప్పింది. 'తీసుకురా' అన్నాడు భూపతి.

చారు అప్పుడు చేగోడీలువండుతూవుంది భర్తకోసం! "ఇప్పుడే కావాలా?"

"ఆఁ ఇప్పుడేకావాలి!"

చారు భగోణీ దించి, అలమారులోనుంచి రచనలు తెచ్చింది. భూపతి ఆలస్యానికి వోర్వలేక, ఆమెచేతిలోనుంచి లాక్కొని మండుతున్న పొయ్యిలోవేశాడు. చారు త్వరగా బయటికి లాగటానికి ప్రయత్నిస్తూ- 'యిదేమిపని!' అంది.

భూపతి ఆమె చెయ్యిపట్టుకుని గర్జిస్తూ- "వద్దు, తీయ వద్దు." అన్నాడు.

చారు నివ్వెరపోయి అలానే నిలబడింది. ఆ రచనలన్నీ కాలి, భస్మమయినవి. చారు అర్థంచేసుకుని, నిట్టూర్చింది. వండే చేగోడీలుమాని, నెమ్మదిగా అక్కడనుంచివెళ్ళిపోయింది.

అతనికి చారుయెదటే తన రచనలు తగలబెట్టాలనిలేదు.

కాని, యెదురుగా మండుతున్న పొయ్యిచూసి, వాళ్ళపై తెలియలేదు. నిబ్బరించుకోలేకపోయాడు. వంచితభర్త కృషి అంతా, వంచకురాలైన భార్య కళ్ళముందరే నిప్పులపాలయింది. అంతా కాలి బూడిదకాగానే, అతని ఆగ్రహం కొంత శాంతిం చింది. చారు తన అపరాధాలభారంతో ఎలా గంభీరవిషా దంతో నిశ్శబ్దంగా తలవంచుకుని వెళ్ళిందో అతనికి స్ఫురణకు వచ్చింది! ఎదురుగావున్న భగోణీవంకచూసి- "నాకు చేగోడీ లంటే ప్రాణమని, తనచేతిమీదగా యెంతశ్రద్ధతో వండు తూంది!" అనుకున్నాడు.

భూపతి వరండాలోకి వెళ్ళి, ఆలోచించుకోసాగాడు. "యీ అవిశ్రాంతప్రవంచనలను, ప్రయత్నాలను మించి ప్రపంచంలో కరుణాజనకమైన విషయం యేమివుంటుంది? ఈ వంచనను వంచకురాలి ఛలనామాత్రంగా భావించ వీలు లేదు - ఇందుకుగాను, ఆ దురదృష్టవంతురాలు తన విదీర్ణ హృదయంలోని గాఢ వేదనను ద్విగుణీకృత మొనర్చుకొని,ప్రతి క్షణమూ తన రక్తాన్ని యెంత ధారపోసిందో!"

మళ్ళీ మనసులో ఆ అబల దుఃఖితనుగురించి "ఈ నటనంతా దేనికి కావలసివచ్చింది? యిన్నాళ్ళనుంచి నేను ఆశించిన ప్రేమ లభించకపోయినా, వల్లెత్తుమాట అనలేదే! నా కాలమంతా సంపాదకీయాలు, ప్రూఫులతో గడిచిపోతూ వుంది; నన్ను మభ్యపెట్టటానికి యీ తంతు దేనికి?" అని తల పోయసాగాడు.

అప్పుడు భూపతి తన జీవితాన్ని, చారుజీవితంనుంచి వేరుచేసి, డాక్టరు అసాధ్యవ్యాధిగ్రస్తుడైన రోగిని చూసినట్టు,

నిస్సంపర్క వ్యక్తి మాదిరి పరిశీలించసాగాడు. బలీయమైన ప్రపంచం నలుదిక్కులనుంచీ దుర్బల నారీహృదయాన్ని పీడిస్తు వుంది. స్వీయగాథ చెప్పుకోదగిన వ్యక్తిగాని, భాషారూపంలో వ్యక్తపరచవలసిన విషయంగాని, హృదయం విప్పి, దుఃఖం వెళ్లబోసుకుని హృదయాన్ని తేలికపరచుకునే తావుగాని లేదు - అయినా యీమె, అప్రకాశ్యము, అపరిహార్యము, అప్రతివిధేయమూ అయి, క్షణక్షణ ప్రవర్ధమానమయ్యే దుఃఖభారం వహిస్తూ, స్వసచిత్తులైన యిరుగుపొరుగు స్త్రీల మాదిరి యథాప్రకారం ఇంటిపనులు చక్కబెట్టుకోవలసి వస్తూంది!

భూపతి పడక గదిలోకి వెళ్ళాడు, కిటికీ చువ్వలు పట్టుకుని. చారు శుష్క నేత్రాలతో రెప్పవేయకుండా వెలుపలికి చూస్తూవుంది. అతను నెమ్మదిగా ఆమె వెనుకకు వెళ్ళి నిలబడ్డాడు - మెదలకుండా ఆమె తలమీద చేయివేసి పూరుకున్నాడు.

# 20

మిత్రులు భూపతిని "యివేళ యేదో విశేషంవుందే చాల హడావుడిగా వున్నావు!" అన్నారు.

"పత్రిక వొకటి—"

మిత్రుడు మధ్యలోనే అందుకున్నాడు. "యిల్లూవాకిలి అంతా పత్రికతో చుట్టి గంగపాలు చేద్దామని నిశ్చయించుకున్నావా?"

"అదికాదు, నేనుగా పత్రిక పెట్టటంలేదు!"

"మరి యెవరట?"

"మైసూరునుంచి కొత్తగా ఒక పత్రిక వెలువడుతుంది. దానికి నన్ను సంపాదకునిగా వుండమన్నారు."

"అయితే, యిల్లూ వాకిలి వదిలిపెట్టి మైసూరు ప్రయాణం తలపెట్టావన్నమాట! చారుకూడా వస్తుందా?"

"లేదు, బంధువులందరూ యిక్కడే వుంటారు."

"యింతకూ నీకు సంపాదకీయాల పిచ్చి వదల్లేదు!"

"మానవమాత్రుణ్ణి భాయీ! మనిషికి యేదో వొక పిచ్చిలేనిదే బ్రతికేది యెలా?" అన్నాడు భూపతి.



భూపతి వెళ్ళేటప్పుడు - "మళ్ళీ యెప్పుడు వస్తారు?" అని అడిగింది చారు.

"నీకువొంటరితనంభారమనిపించినప్పుడు, నాకువ్రాయి. నేను బయలుదేరి వస్తాను."

భూపతి గుమ్మందాకా వెళ్ళాడు. చారు హఠాత్తుగా పరుగెత్తుకువెళ్ళి, అతనిచేయి పట్టుకుని - "నన్ను వొంటరిగా విడిచి వెళ్ళకండి. నన్నుకూడా తీసుకు వెళ్ళండి!" అంది.

భూపతి నివ్వెరపడి, ఆమె మోమువంక చూస్తూ వుండిపోయాడు. పిడికిలి బిగువు తప్పి, అతని చేతిమీదనుంచి చారుచెయ్యి జారిపోయింది. అతనుచారుకు కొంచెందూరంగా వెళ్ళి వరండాలో నిలబడ్డాడు.

అమలుని వియోగస్మృతి నలుదిక్కులా గ్రసింప జూస్తున్న ఈ ఇంట్లోనుంచి దావానలంలో చిక్కుకున్న లేడివలె

చారు బయటపడ చూస్తుందని భూపతికి వెంటనే స్ఫురించింది. “కాని నా విషయం ఈమె ఒక్కపర్యాయమైనా ఆలోచించిందీ! నేను యెక్కడకువరుగెత్తాలో! నిరంతరం హృదయంలో వరులను ధ్యానించే స్త్రీని, దూరప్రాంతం వెళ్ళినా, మరవటానికి అవకాశం లభించదు. నిర్జన బంధువిహీన ప్రవాసంలో కూడా నిత్యమూ యీమెకు తోడ్పడుతూ ఉండాలి. పగ అంతా చాకిరిచేసి యింటికి వచ్చినప్పుడు సందెవేళలు ఆ నిస్తబ్ధిలో కాకులస్త్రీవల్ల యెంత భయంకరంగా వుంటవి. హృదయంలో శవభారం వహిస్తూవున్న ఆమెను నా హృదయ సమీపాన ఎంతకాలమనిబంధించివుంచగలను? నిత్యమూ ఎంత కాలం ఇలాజీవించటం? ఆశ్రయగృహము విరిగి కూలిపోయింది. ఆ కలప, రాళ్ళు, పెంకులుకూడా ఎక్కడివక్కడ విడిచిపెట్టి పోవటానికి నోచుకోలేదునేను. ఆ బరువు నెత్తిమీద పెట్టుకునే వెళ్ళాలా?” అని లోలోపల అనుకోసాగాడు భూపతి.

అతను చారువద్దకువచ్చి “కాదు, ఇక నావల్లకాదు” అన్నాడు.

క్షణమాత్రంలో ఆమె మొహాన నెత్తురుచుక్క లేదు. ఆమె మోము కాగితంమాదిరి తెల్లబడి, శుష్కించిపోయింది. చారు మంచంపట్టె పట్టుకుని అతి శ్రమమీద నిలబడగలిగింది.

భూపతి వెంటనే “పద చారూ! వెళ్దాం” అన్నాడు.

“వద్దులేండి!” అంది చారు.

# ఒక రాత్రి

సురబాల, నేనూ ఒక బళ్ళో చదువుకున్నాము, జతగా ఆడుకుంటూ ఉండేవాళ్ళము! తరచుగా వారింటికి కూడా వెళ్ళుతుండే వాణ్ణి. సురబాల తల్లికి నేనంటే, అమిత వాత్సల్యం! అప్పుడప్పుడు మా ఇద్దరినీ ఒకచోట నిలబెట్టి, మావంక రెప్ప వేయకుండా చూస్తూ—"చక్కని ఈడుజోడు" అంటుండేది.

అప్పటికి చాలా చిన్నవాణ్ణి. కాని ఆమాట అర్థం చేసుకోవటంలో నేనేమీ పొరపడలేదనుకుంటాను. కారణం, చిన్నతనంనుంచీ సురబాలమీద, ఇతరుల కెవరకూలేని ప్రత్యేకాధికారం నాకు ఉందనే అభిప్రాయం మనసులో స్థిరపడి పోయింది. ఆ మైకంలోపడి, యిష్టారాజ్యంగా ఆమెమీద పెత్తనం చలాయించాను ఒకవేళ ఆమెకు అన్యాయం జరిగి వున్నా, అందులో ఆశ్చర్యం పడవలసిందేమీ లేదు. కాని సురబాల ఎంతో సహనంతో నా ఉత్తరువులన్నిటినీ తు. చ. తప్పకుండా పాటించేది. అలా పాటించనప్పుడు నేను విధించే శిక్షను అంగీకరించేది! ఆ పేటలో వారంతా ఆమె చక్కదనాన్ని పొగుడుతుండేవారు. కాని నాలాంటి పెంకెఘటం వద్ద దానికి విలువ ఏముంటుంది? సురబాల నేను చెప్పినట్లు

నడుచుకోవటానికే గడ్డమీద పుట్టిందనుకుని ,ఆమెను ఒక లెఖ్ఖగా చూసేవాణ్ణికాదు.

మాతండ్రిగారు ఆవూరు జమీందారుగారింట్లో పై యెత్తున అన్నిపనులూ చూస్తుండేవారు. నాకు వ్రాత కుదిరినాక, కొన్నాళ్ళు జమీందారీ ఆఫీసులో పనినేర్పి, ఎక్కడైనా గుమాస్తాగా పెట్టాలని తండ్రిగారి ఉద్దేశం! కాని నాకు ఆమాటవింటేనే, లోలోపల చిరాకుగా ఉండేది. మాపేట లోని నీలిరతను కలకత్తా పారిపోయి, అక్కడే చదువుకుని, ప్రస్తుతం కలెక్టరు పర్సనలు అసిస్టెంటుగా పనిచేస్తున్నాడు. నా జీవితానికికూడా అదే ఆదర్శమని చెప్పవచ్చు! పర్సనలు అసిస్టెంటును కాకపోతే మానె, కనీసం కోర్టు హెడ్ క్లర్కు నయినా అవుదామని మనసులో సంకల్పించుకున్నాను.

మా తండ్రిగారు కోర్టుసిబ్బందికి విశేషంగా చేసే ఆదర సత్కారాలు నాకు వూహ తెలిసినప్పటినుంచి చూస్తున్నాను. పండుగ–పబ్బాలకు కాయగూరలు, పండ్లుఫలాలు కానుకలతో వారిని అర్చించటం నాకళ్ళారా చూశాను. అందువల్ల కోర్టు బిళ్ళబంట్రోతుకూడా నా మనసుకు సన్మానపాత్రుడుగా తోచాడు. నిజానికి వీరు మన దేశానికి దైవసమానులు. ముప్పయిమూడు కోట్ల దేవతలకు వీరు మారురూపమని చెప్పవచ్చు!

నేనుకూడా నీలరత్నను తార్కాణంగా తీసుకుని, 'ఒక నాడు వీలుచిక్కగానే కలకత్తా వుడాయించాను. ముందు మావూరివారు పరిచయస్తులుంటే, అక్కడకి వెళ్ళాను. ఆ తరు

వాత మా తండ్రిగారుకూడా కొద్దిగా డబ్బుపంప నారంభిం చారు; క్రమంగా చదువు సాగుతూవుంది.

మధ్యమధ్య సభలకు, సమావేశాలకు వెళ్తుండేవాణ్ణి. దేశంకోసం ప్రాణాలర్పించవలసిన అవసరం యేతయినా వుందని గట్టిగా నమ్మాను. కాని ఈ దుర్ఘటకార్యం యెలా నెరవేర్చాలో బోధపడలేదు; ఎవరినయినా అనుకరిద్దామంటే, దృష్టాంతం కన్పించలేదు.

కాని నాలో వుత్సాహానికి తిరుగులేదు. మేము పల్లెటూరులో పుట్టి పెరిగాము. కలకత్తా బాలురమాదిరి ప్రతి విషయాన్ని తేలికగా చూడటం మావల్ల కానిపని! అందువల్ల నే మా దేశభక్తి చాలా గాఢమైనదనుకుంటాను. మా కార్యకర్తలు వుపన్యాసాలిచ్చేవారు. మేమేమో చందాలలిస్టు చేత పట్టుకుని, నిద్రాహారాలు మాని, మిట్టమధ్యాహ్నంపూట ఇంటింటికి బిచ్చానికి బయలుదేరేవాళ్ళము; రోడ్డుప్రక్కన నిలబడి కరపత్రాలు పంచటమూ, మీటింగులకు కుర్చీలు, బల్లలు సర్దటమూ, మా కార్యకర్తలను యెవరయినా పల్లెత్తు మాటఅంటే, తగాదాకు కాలుదువ్వటమూ మాకార్యక్రమం!

పట్టణ బాలురు మాప్రవర్తనచూసి, 'పల్లెటూరి సరుకు' అని, పేరుపెట్టేవారు మాకు!

పర్సనలు అసిస్టెంటు నవుదామని కలకత్తా చేరి, గార్డ్ బాడ్జీని కావాలని కలలుగంటున్నాను.

ఇంతలో సురబాల తండ్రి, మా తండ్రి సంప్రదించుకుని సురబాలను నాకిచ్చి పెళ్లిచేద్దామని ప్రయత్నాలు చేస్తున్నారు.

నేను పదిహేనోయేట కలకత్తా వచ్చాను; అప్పటికి

సురబాలకు యెనిమిదేళ్లుంటవి. ఇప్పుడు నాకు పద్దెనిమిది జరుగుతూంది. పెళ్ళియీడు దాటిపోతుందని తండ్రిగారు అభిప్రాయపడ్డారు. ఇక్కడ నేను 'జీవితాంతం బ్రహ్మచారిగా వుండి, దేశంకోసం ప్రాణాలర్పించాలని' లోలోపల శపథంచేశాను. 'చదువు పూర్తికానిదే, పెళ్ళివిషయం తలపెట్టవద్దని' ఇంటికి వుత్తరం వ్రాశాను.

రెండుమూడు మాసాలు గడిచినాక, వకీలు రామలోచనుతో సురబాల పెళ్ళి అయిందని తెలిసింది. పతిత భారత దేశంకోసం చందాల వసూళ్లలో మునిగితేలుతున్న నాకు ఈ వార్త చాల తుచ్ఛంగా కన్పించింది.

ఎంట్రెన్సు పూర్తిచేశాను. మొదటి సంవత్సరపు పరీక్షలు దగ్గరకు వస్తున్నవి. ఇప్పుడే తండ్రిగారి మరణవార్త వచ్చింది. అందువల్ల ఉద్యోగాన్వేషణకు బయలుదేరవలసి వచ్చింది. చివరికి నానా తిప్పలుపడి మారుమూలనున్న ఒక పల్లెలో సెకండరీగ్రేడు నౌకరి సంపాదించాను.

నాకు తగినపని దొరికిందని వుబలాటపడ్డాను. విద్యార్థులకు దేశపరిస్థితులు బోధచేసి, ఉత్సాహం పురికొల్పి దేశ సేవకులుగా తయారు చేద్దామనుకున్నాను.

వుద్యోగంలో ప్రవేశించాను. అందరిదృష్టి దేశ కళ్యాణం మీదకంటే రాబోయే పరీక్షలమీదే యెక్కువగావుంది. విద్యార్థులకు గ్రామరు, ఆల్జిబ్రా తప్ప ప్రపంచవిషయాలు బోధించడం హెడ్మాష్టరుగారికి గిట్టదు. రెండుమాసాలకే నా ఉత్సాహమంతా సన్నగిలింది.

నాలాంటి ప్రతిభావిహీనులు అనేకం సంకల్పించు

కుంటూ ఉంటారు. కాని కార్యక్షేత్రంలో అడుగిడి మెడమీాద కాడిమోపి తోక మెలిపెట్టినప్పుడు తలవంచి అన్నిటికీ సహిస్తూ పగలంతా దున్నుతుంటాము. దానికి ప్రతిఫలంగా రాత్రికి కడుపునిండా తిండి దొరుకుతుంది. సంతుష్టి చెందుతాము. ఇక మనలో ఉత్సాహోద్రేకాలు నశించి పోతవి.

ఆ రోజుల్లో అగ్నిప్రమాదాలు జాస్తి కావటంచేత ఒక మాష్టరు స్కూల్లోనే ఉండేవాడు. నేను ఒంటరిగాణ్ణి గనుక ఆ భారం నామీాద పడింది. స్కూలుకు ఆనుకుని పూరిపాక ఉంది. నేను అందులో ఉంటున్నాను.

స్కూలు పూరికి కొంచెం ఎడగా చెరువుగడ్డనవుంది. చుట్టూ పోకచెట్లు, కొబ్బరిచెట్లు పెరిగినవి. స్కూలునానుకుని పెద్ద నిమ్మచెట్లు రెండువున్నవి. వాటినీడ మాష్టర్లకూ, విద్యార్థులకూ చాలా ఉపయోగించేది.

నేనొకవిషయం మరిచాను. అది ఇప్పటివరకు వుల్లేఖించ తగినదిగా తోచలేదు. యిక్కడ గవర్నమెంటు ప్లీడరు రామలోచనబాబు యిల్లు మా స్కూలుకు సమీాపంలోనే వుంది. వారితోపాటు వారిభార్య-నాబాల్య స్నేహితురాలు-సురబాలకూడా ఉంటున్నదని నే నెరుగుదును.

రామలోచన బాబుతో నాకు పరిచయమయింది. సురబాలతోటి నా బాల్య స్నేహాన్ని గురించి వారికి తెలుసో తెలియదో నేను చెప్పలేను. నేనుకూడా ఈ కొద్దిపరిచయంతో వారివద్ద యీ ప్రసక్తి తేవటం మంచిదికాదనుకున్నాను. అసలు సురబాలతో పొకప్పుడు, జీవితంలో నాకు గాఢస్నేహమున్నదనికూడా మనసుకు రాలేదు!

ఒకసారి సెలవురోజున వారింటికి వెళ్ళాను. ఏవిషయాన్ని గురించో చర్చిస్తున్నాము. బహుశా భారత దేశ దుస్థితిని గురించేమో! ఆ విషయంమీద ధూమపానంచేస్తూ గంటల తరబడి అనర్గళంగా మాట్లాడుతూ గడవవచ్చు.

ఇంతలో పక్క గదిలోనుంచి గాజుల గలగల, దుస్తులు సవరించిన శబ్దము, సుకుమార పాదాల సవ్వడి వినిపించినవి. ఎవరో కిటికీ తలుపు సందునుంచి కుతూహాలంతో నావంక చూస్తున్నారనిపించింది.

మరుక్షణమే నాకు సురబాల నేత్రాలు తలపుకు వచ్చినవి. విశ్వాసము, సారళ్యము, బాల్యప్రేమ చిప్పిలుతుండేవి. ఆమె నేత్రాలు – నల్లని కనుపాపలు, స్థిరమైన స్నిగ్ధదృష్టి ఉన్నట్టుండి ఎవరో నా హృదయాన్ని గుప్పెట్లో బిగించి నొక్కివేస్తున్నట్లుంది; వేదనతో నా హృదయము వచ్చి పుండు మాదిరి అయింది.

నేను పూరిపాకకు తిరిగివచ్చాను. కాని బాధ యథాతథంగానేవుంది. నేను నా పనిపాటలు చూసుకునేవాణ్ణి కాని ఆ వేదన తగ్గలేదు. మనస్సు భారాక్రాంతమై తల్లడిల్లుతూ వుంది.

రాత్రికి కొంచెం స్థిమితపడి 'ఇలా జరిగిందేమిటా ?' అని ఆలోచించసాగాను. 'నీ సురబాల యేమయింది ?' అని మనస్సు ప్రశ్నించింది.

"మనస్ఫూర్తిగా వద్దనుకున్నాను. కాకపోయినా ఎల్లకాలమూ నాకోసం కనిపెట్టుకు కూర్చుంటుందా?" అని నచ్చచెప్పటానికి ప్రయత్నించాను.

"ఆనాడు కావాలనుకుంటే, పొందగలిగేవాడివి. ఇవాళ తల బద్దలు చేసుకున్నా, ఒక్కసారి కంటితో చూసే హక్కు కూడా లేదు. ఆ చిన్నప్పటి సురబాల నీకెంత ఆత్మీయురాలు అయినప్పటికీ, ఇవాళ ఆమె గాజులరవళి, శిరోజాలు వెదజల్లే కమ్మని సువాసనలు మనసార తలచుకోవచ్చు. కాని మధ్యను అడ్డుగోడమాత్రం వుంటుంది"

"అయితేమాసె, అసలు సురబాల నాకు యేమవుతుంది?"

"ఇవాళ ఏమీకాదని అంగీకరిద్దాము. కాని ఒకనాడు యెంత సన్నిహితురాలు కావటానికి అవకాశంవచ్చింది?"

ఆమాట అక్షరాలవాస్తవం! కావాలనుకుంటే, ఆనాడు అందరికంటె సన్నిహితురాలు, ఆత్మీయురాలు అయ్యేది. నా కష్టసుఖాల్లో పాలుపంచుకునేది. కాని నేడు దూరమైపోయింది. పరాయిమనిషి అయింది. నేను కంటితో చూడరాదు, మాట్లాడిస్తే తప్పు. ఆమెనుగురించి ఆలోచిస్తే పాపం! రామలోచను డనే అపరిచిత వ్యక్తి ఎక్కడినుంచో వచ్చి, నాలుగుమంత్రాలు వుచ్చరించి, సురబాలను క్షణకాలంలో దూరంగా తన్నుకుపోయాడు.

మానవసమాజంలో నవ్యనీతిని నేనేమీ ప్రచారం చేయబోవడం లేదు; సాంఘిక కట్టుబాట్లను తుత్తునియలు చేయటంకూడా నాకిష్టంలేదు. నేనుమాత్రం నా మనోభావాలను వెలిబుచ్చుతున్నాను. నా మనసులో వుత్పన్నమయ్యే భావాలన్నీ ఆలోచించదగినవా? కాని నేను ఏం చేయను? రామలోచనుని ఇంట్లో గోడచాటున నిలబడివున్న సురబాల,

వారికంటె నాకే యెక్కువ ఆత్మీయురాలనే భావం నన్ను వెన్నాడుతూ వుంది. యిలా ఆలోచించటం, అసంగతము, అన్యాయమనికూడా అంగీకరిస్తాను కాని ఈమాదిరి జరగటం అస్వాభావికము మాత్రం కాదు.

నాకు యేవనీ చేయబుద్ధి పుట్టటంలేదు. మధ్యాహ్నము క్లాసులో పిల్లలు చదువుకునేటప్పుడు, వెచ్చని గాలులు సీమ్మ పూత సువాసనలతో మిళితమై వస్తున్నప్పుడు నా మనస్సు వరి పరివిధాల పోయేది. నా మనోరథ మేమిటో నాకే తెలియదు. కాని, భవితవ్యాన్ని గురించిన కలలతో, విద్యార్థుల్ని దేశ సేవకుల్నిగా రూపొందించాలనే సంకల్పంతో, స్కూలులో వ్యాకరణ దోషాలు యెత్తి చూపటంతో జీవితం గడపాలనే కోరికమాత్రం బొత్తిగా లేదని నొక్కిచెప్పగలను.

స్కూలు చివరిగంట కొట్టినాక, వొంటరిగా కూర్చో వటం మనస్కరించటంలేదు; పెద్దమనిషి యెవరైనా కలుసు కుందామని వస్తే, అదీ చికాకుగా వుంటుంది. సాయంకాలం చెరువుగట్టున పోకచెట్లు, కొబ్బరిచెట్ల మర్మర ధ్వనులువింటూ యెన్నో ఆలోచించేవాణ్ణి. మానవ సమాజము జటిలమైన ఒక భ్రాంతిజాలం వంటిది! సకాలంలో పనులు నిర్వర్తించటం యెవరికీ గుర్తువుండదు; ఆ తర్వాత అకాలంలో అనుచిత వాంఛలతో క్రిందుమీదవుతూ వుంటాము.

నాలాంటి వ్యక్తి సురబాలను పెళ్ళాడి, జీవితం సుఖంగా వెళ్ళబుచ్చేపని; కాని నేను గారీ బాల్డీని కావాలని బయలు దేరాను. చివరకి జరిగిందేమిటి? ఒక పల్లెటూరు స్కూలులో సెకండరీ గ్రేడు టీచరు నయాను! రామలోచనుడు వకీలు;

వారికి ప్రత్యేకించి సురబాలనే భార్యగా పొందవలసిన అవసర మేమీ లేదు; మూడుముళ్లూ పడేక్షణం వరకూ, వారికి సుర బాల అయినా వొకటే, ఇందుబాల అయినా వొకటే! ఆ రామలోచనబాబే, దూరదృష్టిలేకుండా సురబాలను చేబట్టి గవర్నమెంటు ప్లీడరయి, రెండుచేతులా డబ్బు సంపాదిస్తు న్నాడు. పాలు కాటువాసన వచ్చినరోజున సురబాలమీద కసురుకుంటాడు. మనస్సు ప్రసన్నంగావున్నరోజున కంసాలిని పిలిచి, ఆమెకు నగలు చేయిస్తాడు. వారు స్థూలకాయులు, కోటు వేస్తుంటారు; జీవితంలో అసంతృప్తి అనేది యెరగరు. వారికి యేనాడూ చెరువుపొడ్డున కూర్చుని, రాత్రిళ్ళు నక్షత్రాలు లెక్కిస్తూ గడప పనిలేదు!

రామలోచనబాబు కోర్టుపని తగిలి, పొరుగూరు వెళ్లారు. స్కూల్లో నామాదిరే, సురబాలకూడా యింట్లో యేకాకిగా వుండవచ్చు!

ఆనాడు సోమవారమని గుర్తు! వుదయంనుంచీ మబ్బు పట్టింది. పదింటికి వర్షం ప్రారంభమయింది. హెడ్మాష్టరు మొయిలు చూసి, స్కూలుకు సెలవిచ్చారు. కారుమబ్బులు యేదో మహాసన్నాహంతో ఆకాశంలో అటూ ఇటూ పగ లంతా పరుగులిడుతున్నవి. మరుచటిరోజు సాయంత్రానికి కుంభ వర్షంతోపాటు, పెనుగాలికూడా సాగింది. ప్రొద్దుపోయిన కొద్దీ గాలి–వాన వుధృతమయింది. మొదట్లో తూర్పుగాలి కొట్టింది; తర్వాత క్రమంగా వుత్తరంనుంచి, ఈశాన్యమూలనుంచి గాలి వీస్తూవుంది.

హెడ్‌క్లర్కును, కలెక్టరు పర్సనల్ అసిస్టెంటును, గారీ ఛాల్డిని—యేమీకాలేదు; చివరికి పల్లెటూరు బడిపంతులిని అయినాను! నా సంపూర్ణ జీవితంతో క్షణకాలంపాటు, ఒక అనంతరాత్రి ఉద్భవిల్లింది. నా దీర్ఘాయువులో ఆ 'ఒక్కరాత్రీ' యీ క్షుద్రజీవితంలో పరమసార్థక మయినట్టు యెంచుతున్నాను.

# శాస్త్రీయ నవల

'అల్లాహో అక్బర్' నినాదంతో రణరంగము ప్రతిధ్వనించింది. ఒకవంక మూడులక్షలమ్లేచ్ఛ సైన్యము, మరొక వంక మూడు వేల ఆర్యసైన్యము వుంది. వరదమధ్య పిప్పలీ వృక్షం మాదిరి హిందూ వీరులు అహోరాత్రులుయుద్ధంచేస్తూ చెక్కు చెదరకుండా నిలువరించి వున్నారు. కాని ఇప్పుడు పరాజయలక్షణాలు కనుచూపుమేరలో గోచరిస్తున్నవి. పరాజయం పొందగానే భారతవిజయపతాక నేలకు వొరుగుతుంది. నేటి అస్తాచలగామి సూర్యునితోపాటు, భారతగౌరవభానుడు అస్తమిస్తాడు.

'హరహర మహాదేవ్' పాఠకులారా, ముప్పయిఐదు మంది అనుచరులను వెంటబెట్టుకుని, విచ్చుకత్తి చేబట్టి, అశ్వారూఢుడై, భారతఅధిష్ఠానదేవతచేతితో విసరినవజ్రదండంమాదిరి శత్రుసైన్యంమీద విరుచుకుపడిన ఆ యువకుడెవరో చెప్పగలరా? ఎవని శౌర్యప్రతాపాలకు సమస్త తురుష్క సైన్యము, ప్రచండ ఝంఝూమారుతానికి అడవిలోని చెట్లమాదిరి గజగజలాడిపోయినవో వూహించగలరా? ఎవని వజ్రకంఠంనుంచి వుద్ఘోషితమైన 'హరహర మహాదేవ్' నినాదంవల్ల మూడు లక్షలసైనికులి 'అల్లాహోఅక్బరు' ఆకాశంలోవిలీనమయిందో, తళతళ మెరిసే, యెవని ఖడ్గ సమక్షాన, శార్దూలాక్రమిత

మేఘంమాదిరి శత్రుసేన తోకముడిచి, పలాయనమంత్రం పఠిం చిందో, ఆనాటి ఆర్యావర్త సూర్యభగవానుడు, తన సహస్ర రక్త కర స్పర్శతో యెవని రక్తసిక్త ఖడ్గాన్ని ఆశీర్వదించి, అస్తాద్రికి విశ్రమించటానికి వెళ్ళాడో వూహించగలరా?

అతనే కాంచీరాజ్య సేనాధిపతి, భారత దేశ చరిత్రలో ధ్రువనక్షత్రము అయిన, మన లలితసింహుడు!

## 2

ఇవాళ కాంచీనగరంలో యెందుకు వేడుకలు జరుగు తున్నవి? రాజప్రాసాదాలమీద విజయపతాకం ఎందుకు అలా వుర్యాలలూగుతూవుంది? గాలి వురవడికా? కాదు, కాదు, ఆనందోద్వేగంతో! ప్రతివాకిట కదళీవృక్షాలు, మంగళ కల శాలు అమర్చారు. యింటింటా జయధ్వానాలు మారు మ్రోగుతున్నవి; దారిపొడుగునా దీపమాలలు విరాజిల్లు తున్నవి. నగరమంతటా, చివరికి గోడలమీదకూడా, జనం క్రిక్కిరిసివున్నారు. పురవాసులు ఇంత ఉత్సుకతతో ఎవరి కోసం నిరీక్షిస్తున్నారు?

అకస్మాత్తుగా పురుషకంఠాలు జయధ్వానాలు, కామినీ కంఠాల హర్ష ధ్వానాలు మిళితమై, ఆకాశాన్ని భేదిస్తూనక్షత్ర లోకాన్ని అందుకున్నవి. ఆకాశంలోని నక్షత్రాలన్నీ గాలికి కంపించే దీపశిఖలమాదిరి కంపిస్తూన్నవి.

ఉత్తమాశ్వాన్ని అధిరోహించి, పురద్వారాన ప్రవే శించే ఆ వీరశిఖామణిని గుర్తించారా? అతనే మనపూర్వ పరిచిత కాంచీరాజ్య సేనాధిపతి లలితసింహుడు! శత్రు

సంహారంచేసి, కాంచీమహారాజు పాదపద్మాలకు, శత్రురక్త రంజితమయిన ఖడ్గాన్ని బహూకరించటానికి మన సేనానాయకుడు విచ్చేస్తున్నాడు; అందుకే యీ వుత్సవాలు !

కాని, యీ విజయధ్వానాలను సేనాపతి వకికిస్తున్నట్టు లేదు. పురకాంతలు కురిపించే పుష్పవృష్టిమీదికి అతని చూపు పోవటంలేదు. అడవిలో దప్పికగొన్న బాటసారి సరోవరం వద్దకు పరుగుతీస్తు, నెత్తిమీదరాలే యెండుటాకుల విషయం ఆలోచిస్తాడా ? అధీరచిత్తుడైన లలితసింహునికి యీ సన్మానోత్సవాలు యెండుటాకుల మాదిరి నీరసంగా, మామూలు విషయంగా కన్పించినవి !

అంతఃపుర ప్రాసాదంవద్దకు రాగానే కళ్ళెంలాగి, అశ్వరాజాన్ని క్షణకాలం నిలిపాడు. అతను వొకసారి ప్రసాద గవాక్షంవైపు తృషిత నేత్రాలతో చూశాడు. క్షణకాలంపాటు లజ్జావనత దృష్టి అతని మోము నోదికి ప్రసరించింది విద్యుల్లత మాదిరి ! రెండు అనింద్యహస్తాలు పైనుంచి వొక పూమాలను జారవిడిచినవి. లలితసింహుడు తక్షణమే క్రిందికిదిగి, నేలమీద పడిన ఆ పూమాలను తీసి, మకుటానికి అద్దుకుని, కృతార్థ దృష్టితో పైకి కన్నెత్తిచూశాడు. అప్పటికే తలుపులు మూయబడినవి. దీపం ఆరిపోయింది.

# 3

వేలాది శత్రుసేనలముందు చలించని ఆ వీరుడు మృగనేత్రి సమక్షాన పరాజితుడయాడు. అతను చాలాకాలంనుంచి రాతికోటవలె ధైర్యాం కాపాడుకుంటూ వస్తున్నాడు. నిన్న

సాయంకాలం లజ్జాదరాలు మిళితమైన ఆ మృగనేత్రి దృష్టి కోట పునాదులు కదిలించివేసింది. ఇన్నాళ్ళ ధైర్యమూ క్షణ కాలంలో మంటకలిసింది. ఛీ, ఛీ సేనాపతీ! విశ్వవిజేతలైన మీలాంటి వీరపురుషులు, దొంగమాదిరి అంతఃపుర వుద్యాన వనకుడ్యాన్ని లంఘించటం సబబా?

కాని నవలా రచయితకు అడ్డంకులేమీ వుండవు. అతనిని ద్వారపాలకులు అడ్డగించరు. అసూర్యంపశ్యలు తర ఫునకూడా అతనికేమీ అభ్యంతరం రాదు! కాబట్టి, యీ చక్కని సందెవేళ దక్షిణవాయువులు వీచే, అంతఃపుర వుద్యాన వనంలోకి ఒకసారి ప్రవేశించాలి! పాఠకలారా, మీరుకూడా రండి! పాఠకులారా, యిష్టమయితే, మీరూ మా వెనువెంట రావచ్చని అభయమిస్తున్నాను!

ఒక్కసారి పరిశీలించిచూడండి. సంధ్యాతారవలె, వకుళ వృక్షంవద్ద వచ్చికపరుపుమీదవున్న రమణీమణి యెవరో గుర్తించారా? ఇంత చక్కదనం మీరెన్నడైనా చూశారూ? ఈ చక్కదనం వర్ణించగలమా? భావయేదైనా మంత్రశక్తితో ఈ సజీవ యవ్వనసౌందర్యాలను చిత్రించగలదా? పాఠకు లారా! మీకు రెండో పెళ్ళి అయివుంటే, భార్య మోమును మనసుకు తెచ్చుకోండి! అందాలుచిందే పాఠకలారా! ఏ యువ తిని చూసి, మీరు మీ చెలికత్తెతో – "చూపులకి యేమంత అందంగావుంది; మొత్తంమీద పరవాలేదులే!" అని చెప్పబడిన యువతి మోమును గుర్తుకుతెచ్చుకొనండి! ఆ పొగడచెట్టు క్రింద కూర్చున్న రాకుమారితో, ఆ యువతిని కొంతవరకు పోల్చవచ్చును! ఆమే మన రాకుమారి విద్యున్మాల!

రాకుమారి వ్రాళ్ళో పూలుపోసుకుని, తలవంచుకుని దండగుచ్చుతూవుంది. ఆ సుకుమారమైనపనికూడా చేయలేక ఆమె చేతివేళ్ళు నొప్పిపుడుతున్నవి. ఆమె వుదాసీనదృష్టి యెచ్చటో చింతారాజ్యంలో పరిభ్రమిస్తూవుంది. ఇంతకూ ఆమె యేమి ఆలోచిస్తున్నట్టు ?

కాని, ఈ ప్రశ్నకు నేనుగా సమాధానం చెప్పను. రాకుమారి యేకాంతహృదయ మందిరంలో ఈ నిస్తబ్ధసంధ్యా సమయాన, యేమర్త్యదైవానికి నీరాజనాలు అర్పింపబడు తున్నవో ! అపవిత్రకుతూహాలంతో అక్కడకు ప్రవేశించ కూడదు. అదిగో, వెచ్చని నిట్టూర్పు, సువాసనలు వెదజల్లే పూజాధూపధూమముమాదిరి, గాలిలోకలిసిపోయింది. రెండు కన్నీటిచుక్కలు, కోమలకుసుమ కోరకాలవలె అజ్ఞాత దేవత పాదాలవద్ద రాలినవి.

ఇంతలో వెనకనుంచి గంభీర వుద్వేగంతో కంపించే పురుషకంఠం 'రాకుమారీ!' అని పిలిచింది.

రాకుమారి భయంతో చీత్కారంచేసింది. నలుదిక్కుల నుంచి సైనికులు పరుగెత్తుకుంటూవచ్చి, అపరాధిని కైదు చేశారు. ఆమెకు తెలివివచ్చేప్పటికి, సేనాపతి బంధింపబడ్డాడని తెలిసింది.

## 4

యీ అపరాధానికి న్యాయశాస్త్రం వురిశిక్షవిధిస్తుంది. కాని మహారాజు, సేనాపతి సేవలను స్మరించి, పదవీభ్రష్టుణ్ణి చేసి, వదిలాడు. సేనాని మనసులో 'రాకుమారీ! నీ నేత్రాలు

కూడా నన్ను వంచించినవ్వాడు, యిరికా ప్రపంచంలో సత్య మనేది యెక్కడవుంది? నేటినుంచి నేను మానవజాతికే పరమ శత్రువును' అనుకున్నాడు. ఆనాటినుంచి వాత దొంగల ముఠాకు నాయకుడై, అడవుల్లో వుంటున్నాడు.

పాఠకులారా? అప్పుడు మనమైతే యేంచేసేవాళ్ళము? తక్షణమే మరొక వుద్యోగంకోసం అన్వేషించేవారము; లేక పోతే వార్తాపత్రిక నొకదాన్ని నెలకొల్పేవారము! అందు లోనూ కష్టాలు యెదుర్కోవాలసి వస్తుందనటంలో సందేహ మేమీలేదు కాని, నవలల్లో సులభమూ, వాస్తవ ప్రపంచంలో దుర్లభమైన సేనాధిపతివంటి వీర పురుషులు ఆ రెంటిలో యేదీ చేయరు! వారు సుఖంగావుంటే, ప్రపంచానికంతటికీ మేలు చేకూరుస్తారు. తమ మనోరథానికి యేమాత్రము భంగం వాటిల్లినా, కళ్లెర్రజేసి – "రాక్షస ప్రపంచమూ, రాక్షస సమాజమూ, నిన్ను కాలరాచి పగసాధిస్తాను' అని, తక్షణమే బందిపోటునాయకుడై, తన కార్యక్రమానికి వుపక్రమిస్తాడు. ఇలాంటివి ఆంగ్ల కావ్యాలలో తగులుతుంటవి; రాజపుత్రులలో కూడా ఈ సాంప్రదాయం వున్నదని గట్టిగా చెప్పవచ్చు.

బందిపోటు దొంగల వుపద్రవానికి దేశమంతా భయ భ్రాంతులయారు; కాని ఈ గజదొంగలు అనాథులకు సాయ పడుతున్నారు; దీనులకు ఆప్తులు, దుర్బలులకు ఆశ్రయంగా వున్నారు. కేవలం ధనికులకు, రాజకుటుంబీకులకు, రాజ కర్మ చారులపాలిటి మాత్రం కాల యములని చెప్పవచ్చు!

దట్టమైన అడవి; ప్రొద్దుగ్రుంకుతూవుంది. చెట్లనీడవల్ల అకాలంలోనే చీకట్లు ముసురుతున్నవి. యెవరో యువకుడు

వొంటరిగా అపరిచితమార్గానపడి వెళ్ళుతున్నాడు. అతని సుకుమార శరీరము, మార్గాయాసంచేత బడలిక జెందింది; అయినా అతనిలో దీక్ష, దృఢత్వం కానవస్తున్నవి. నడుమున వ్రేలాడుతున్న ఖడ్గంకూడా అతనికి భారంగా వున్నట్టు తోస్తూ వుంది. చుట్టుపక్కల యే కొంచెం అలికిడి అయినా త్రుళ్ళిపడి లేడిమాదిరి బెదిరిపోతున్నాడు. కాని చీకట్లు దట్టమవుతున్న రాత్రివేళ. యెన్నడూ అడుగిడని అరణ్యమార్గానపడి, దృఢ సంకల్పంతో సాగిపోతున్నాడు.

దొంగలు నాయకునివద్దకువచ్చి - "ఇవాళ పెద్దజంతువు చిక్కింది! శిరసున మకుటము, రాజదుస్తులు, నడుమున ఖడ్గం వ్రేలాడుతూ వుంది" అని వర్ణించి చెప్పారు.

"నేను వేటాడుతాను. మీరు ఇక్కడేవుండండి."

ఆ బాటసారికి హఠాత్తుగా యెండుటాకుల గలగల విని పించింది; ఔత్సుక్యంతో అతను నలువైపులా కలయ జూస్తు న్నాడు.

ఇంతలో అతని వక్షస్థలంలో రివ్వున ఒక బాణంవచ్చి గుచ్చుకుంది. అతను 'అమ్మా!' అని నేలకు వొరిగాడు.

ఆ సర్దారు దగ్గరకు వెళ్ళి, మోకరిల్లి, వంగి, క్షత గాత్రుని మోమువంక చూశాడు. ఆ బాటసారి సర్దారు చేయి పట్టుకుని, మృదుస్వరంతో ఒక్కసారి - 'లలిత్!' అన్నాడు!

ఆ సర్దారు హృదయం వ్రయ్యలయింది; 'రాకుమారీ!' అని పెద్దపెట్టున ఆర్తనాదం చేశాడు!

దొంగలందరూ వచ్చారు. వేటకాడు, వేటాడబడిన వ్యక్తీ యిద్దరూ ఆలింగనబద్ధులై చచ్చిపడివున్నారు !

రాకుమారి ఒకనాడు సందెవేళ, అంతఃపుర వుద్యానవనంలో, తెలియక, లలితసింహునిమీద రాజదండం విసిరింది; లలితుడు అలానే సందెవేళ, తెలియక, రాకుమారిమీద బాణం విసిరాడు. యీ ప్రపంచానికి వెలుపల యెక్కడయినా వీరిద్దరూ కలుసుకునివుంటే, పరస్పరం క్షమించుకుని వుంటారని ఆశిస్తాను.

# సమర్పణ

బృందావనుడు రోషంతో "నేనిక ఈ కొంపలో ఒక్క-క్షణం వుండను." అన్నాడు తండ్రితో.

"కృతఘ్నుడా! బాల్యంనుంచీ పెంచి పెద్దవాణ్ణిచేశాను. ముందు ఆ ఋణం తీర్చుకో. తర్వాత పౌరుషం చూపుదువు గాని" అన్నాడు తండ్రి యజ్ఞనాథుడు.

ఆ కుటుంబంలో అన్నవస్త్రాల వద్దుచూసి, పెద్దగా ఖర్చు అవుతుందనటానికి సావకాశంలేదు. పూర్వకాలపు మహర్షులవలె అన్నవస్త్రాల విషయంలో మితిలేని పొదుపుతో జీవితం గడుపుతున్నాడు. యజ్ఞనాథుని వైఖరిలో ప్రాచీన ఋషుల ఆదర్శమే ప్రతిబింబిస్తూంది. కాని, కొంత ఆధునిక సమాజ సంసర్గ దోషంవల్లా, కొంత శరీరరక్షణకు సంబంధించిన అనివార్యమైన ప్రకృతి నియమాల ఒత్తిడివల్లా, అతను సంపూర్ణసిద్ధిని అందుకోలేక పోయాడు.

పెళ్ళికానంతవరకు కుమారుడు అన్నీ సహించాడు. కాని ఆ మూడుముళ్ళూ పడగానే, అన్నవస్త్రాల విషయంలో తండ్రీకొడుకుల ఆదర్శాలు కలియలేదు. భేదిస్తూవచ్చినవి. కుమారుని ఆదర్శం క్రమంగా ఆధ్యాత్మికంనుంచి భౌతికానికి మళ్ళుతూవుంది. క్షుత్పిపాసలకు, శీతాతపాలకు విలవిలలాడే

యీ పార్థివజగత్తును చూసి, బృందావనుని అన్నవస్త్రాల పరిమాణంకూడా క్రమంగా వృద్ధిచెందుతూ వుంది.

ఈ విషయాన్ని గురించి తండ్రికొడుకులు తరచుగా కీచులాడుకునేవారు. చివరికి బృందావనుని భార్యకు పెద్దజబ్బు చేసి, నాటువైద్యుడు ఖరీదైన మందువాడాలని చెప్పినప్పుడు తండ్రి ఆ వైద్యుని 'వట్టి చవట' అని నిర్ణయించి వెంటనే సాగనంపాడు. కుమారుడు మొదట తండ్రిని కాళ్ళూ చేతులూ పట్టుకొని బ్రతిమాలాడు; తర్వాత పోట్లాడాడు; కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది. భార్య మరణానంతరము, కుమారుడు తండ్రిని 'హంతకుడని' నిందించాడు.

"మందు వాడిన వాళ్ళెవరూ చనిపోవటంలా? ఖరీదైన మందులు ఇచ్చినంత మాత్రానరోగి ప్రాణాలు నిలిస్తే, రాజులు మహారాజులు కలకాలమూ యిహలోకంలో వుండేవారేగా? నీ తల్లి ముత్తవ కాలధర్మం చెందినట్టుకాక, నీ భార్య గొప్ప ఆడంబరంగా తనువు చాలించాలేమిటి?" అని తండ్రివాదన!

నిజానికి, బృందావనుడు శోకాంధుడు కాకుండా, నిబ్బరంగా ఆలోచిస్తే, కొంత వూరట కలిగేదే! ఆతని తల్లీ, ముత్తవ చనిపోతూ యెవరూ చికిత్స అనేది యెరుగరు. ఈ ఆచారం వారి యింట్లో పారంపర్యంగా వస్తూవుంది. కాని ఈ కాలపువాళ్ళు పాతపద్ధతులలో చావుకుకూడా యిష్టపడరు. నేను చెప్పేది ఆంగ్లేయులు మన దేశంలో ప్రవేశిస్తున్ననాటి సంగతి! కాని అప్పటి ప్రాచీనులు, ఆనాటి కొత్తకారు ఆచార వ్యవహారాలకు దిగ్భ్రమ చెంది, అమితంగా ధూమ్రపానం చేశేవారు!

కాని చివరికి జరిగిందేమిటంటే, అప్పటి నూతన, తరానికి చెందిన బృందావనుడు, ప్రాచీనకాలాన్ని ప్రతిబింబించే యజ్ఞనాథుతో తగాదాపడి, – "నేనిక ఈ కొంపలో వొక్క క్షణం వుండను" అని చెప్పాడు.

తండ్రి తక్షణమే అనుమతిస్తూ, నలుగురి యెదుట "బృందావనుడికి నేను చిల్లిగవ్వ ముట్టజెప్పినా, గోహత్య చేసి నట్టు!'' అన్నాడు.

కుమారుడుకూడా నలుగురిలో "నీ డబ్బు యెర్రని యీగాని ముట్టుకున్నా, మాతృహత్య చేసినట్టే!''నని శపథం చేశాడు.

తర్వాత తండ్రీకొడుకులు దూరమైపోయారు వొకరి కొకరికి. ప్రశాంతంగా వుండే పల్లెలో, యీచిన్న తిరుగుబాటు గ్రామస్తులకు కొంచెం వుల్లాసం కలిగించింది. ముఖ్యంగా బృందావనుడు, వారసత్వాధికారానికి యెడమైనందువల్ల, ఇంచు మించు అందరూ శక్తి కొద్దీ యజ్ఞనాథుని దుర్భరపుత్రవియోగ దుఃఖాన్ని వుపశమింపజేయటానికి ప్రయత్నిస్తున్నారు. "భార్యను వెనకవేసుకవచ్చి, తండ్రితో దెబ్బలాడటం యీ కాలపు వాళ్ళకే తగిపోయింది!" అనేవారు అందరూ!

"భార్యపోతే, మరొక భార్య చిటికెలో వస్తుంది. కాని తండ్రివిషయంలో అదెలా సంభవం?" అని యుక్తి యుక్తంగా వాదించేవారు. ఇది దృఢప్రమాణమని నిస్సందేహంగా చెప్ప వచ్చుగాని బృందావనులాంటి వ్యక్తిమాత్రం ఈ వాదన విని, అనుతాప తప్తుడవకపోగా, నిశ్చింతుడయేవాడని నా నమ్మిక!

కుమారుడు వెళ్ళిపోయినందుకు, తండ్రి మనసు ఎక్కువ కలత పడిందని చెప్పలేము. ఒకటి ఖర్చు తగ్గింది; రెండు, పెద్ద బెడద తీరిపోయింది. కొడుకు యే నిమిషాన విషంపెట్టి చంపుతాడోనని దిగులుగా వుండేది! అసలే తాను తినేది పిట్టమెతుకులు; దానిమీద చావు భయం! కోడలు పోవటమూ, కొడుకు యిల్లు విడిచివెళ్ళటముతోటి యిప్పుడు నిశ్చింతగా వున్నాడు!

అతన్ని ఒక్కబాధమాత్రం పీడిస్తూఉంది. వెళ్ళేవాడు తానొక్కడే వెళ్ళక, బృందావనుడు నాలుగేళ్ళ కుర్రవాణ్ణి కూడా లాక్కుపోయాడు. అందరికన్న ఆ కుర్రవాడి ఖర్చు కూడా తక్కువ. అందుకనే యజ్ఞనాథుకు మనుమడిమీద అంతులేని ప్రేమ! అంత నిర్మల దుఃఖంలోకూడా అతని మనసులో జమాఖర్చుపద్దు వొక్క క్షణకాలం తళుక్కున మెరిసింది—ఇద్దరూ లేనందువల్ల ఖర్చుకాతా ఎంత తగ్గింది, సాలుకు ఎంత మిగులుతుంది; దానిమీద ఎంతవడ్డీ వస్తుందని!

కాని, ఆ శూన్యగృహంలో చిలిపిపనులుచేసే ముద్దుల మనుమడు గోకులచందు లేకపోవటంమూలాన, అతనికి ఇంట్లో వుండటం దుర్భరంగావుంది. ప్రస్తుతం పూజ నిర్విఘ్నంగా సాగిపోతూవుంది; అన్నానికి కూర్చున్నప్పుడు ఎవరూ కలబడి లాక్కుని తినటంలేదు, జమాఖర్చులు వ్రాసుకునేటప్పుడు యెవరు సిరాబుడ్డి తీసుకు పరుగెత్తటంలేదు! నిరుపద్రవంగా, ప్రశాంతంగా నిత్యకృత్యాలు జరిగిపోతున్నందుకు అతనిమనసు చాల ఆరాటపడుతూ ఉంది.

మరణానంతరమే, ఇలాంటి నిరుపద్రవమైన శౌన్యత సంభవమని తోస్తూవుంది–మనమడు పక్క గుడ్డకు పెట్టిన బెజ్జాలు, కూర్చునేచాపమీద వేసినసిరాబొమ్మలు చూసి, అతని మనసు తల్లడిల్లిపోయేది. ఆ కొంటెపిల్లవాడు రెండేళ్ళనాడే, తాత కట్టుకునే ధోవతి చింపి పోగుపెట్టినందుకు నానా చివాట్లు తిన్నాడు! కాని గదిలో పండుకున్నప్పుడు, ముప్పయిమూడు ముళ్ళు వేసి, మురికిపోడే ఆ చింపిరిగుడ్డను చూడగానే అతని నేత్రాలు చెమ్మగిలినై. అది పాత గుడ్డగానో, దీపం వత్తులకో వాడకుండా, భద్రంగా పెట్టెలో దాచి, 'గోకుల్ తిరిగివచ్చి, సంవత్సరానికి వొకధోవతి చొప్పున చింపివేసినా, పల్లెత్తు మాట అన'నని మనసులో వొట్టుపెట్టుకున్నాడు.

కాని గోకుల్ రాలేదు. యజ్ఞనాధునికి కాలచక్రం వెనకటికంటె గిర్రున తిరిగిపోతున్నట్టుంది. నానాటికి యిల్లు బావురుమంటున్నట్టుంది.

అతను యింట్లో క్షణం కుదురుగా కూర్చోలేకపోతున్నాడు. పెద్దలందరూ భోజనాలుచేసి సుఖంగా నిద్రపోతుంటే, ఆ మిట్టమధ్యాహ్నం యజ్ఞనాధుడు పొగత్రాగుతూ వీధుల వెంట తిరుగుతున్నాడు; పిల్లలు అతన్ని చూసి ఆడే ఆటలు మాని నిరాపదస్థానానికి పరుగుతీసేవాళ్ళు. అతని మితవ్యయం మీద స్థానిక కవులు రచించిన గేయ సాహిత్యాన్ని అతనికి వినపడేటట్లు గొంతెత్తి గానంచేసేవాళ్ళు; అతనిపేరు తలిస్తే వస్తులు తప్పవేమోనని పితృదత్తనామంకూడా యెవరూ వుచ్చరించేవారు కాదు! జనం యెవరికి తోచిందివారు, మారుపేరు పెట్టారు. పెద్దలు అతనికి 'యజ్ఞనాశుడు' అని నామకరణం

చేశారు; పిన్నలు 'గబ్బిలాయి' అని యెందుకు పిలిచేవాళ్ళో స్పష్టంగా చెప్పలేకుండా వున్నాము.

## 2

ఒకనాడు నడిజామున మామిడిచెట్ల నీడవున్న వల్లెటూరు రోడ్డుమీద తిరుగుతున్నాడు. ఒక అపరిచిత బాలకుడు పిల్లలగుంపుకు నాయకుడై, అల్లరి చేయటంలో కొత్తపుంత త్రొక్కుతున్నాడు. పిల్లలందరూ కొత్త కుర్రవాడి గుండె దిటవుకూ నవీన కల్పనాశక్తికీ ముగ్ధులై వశ్యులైపోయారు.

మిగతా పిల్లలమాదిరి ఈ అపరిచిత బాలకుడు ఆటలు మాని పారిపోకుండా, యజ్ఞనాథునివద్దకు వచ్చి పైగుడ్డ మీద దులిపాడు. అందులోనుంచి వొకబల్లి ఆ వృద్ధునిమీద పడి, తుర్రున చెట్టుమీదికి పారిపోయింది. ఈ ఆకస్మిక భయానికి వృద్ధుని రోమాలు నిక్కబొడిచినై! పిల్లల ఆనందానికి మేర లేకుండావుంది. యజ్ఞనాథుడు నాలుగడుగులు ముందుకు సాగగానే, భుజంమీది అంగవస్త్రం మాయమయింది. వెనుదిరిగి చూస్తే; అది అపరిచిత బాలకుని తలగుడ్డగా శోభిస్తూంది.

ఆ కొత్త కుర్రవాడి వినూత్న శిష్టాచారానికి యజ్ఞనాథు పరమానందభరితుడయాడు. చాలాకాలంనుంచి యింత నిస్సంకోచ మమత్వాన్ని పొందలేదు. చాలాసార్లు బుజ్జగించి రకరకాల ఆశలు చూపి, ఆకుర్రవాడిని కొంతవరకు లోబరచుకున్నాడు.

"నీ పేరేమిటి?"

"నితాయీ చాందపాల్!"

"మీా యిల్లెక్కడ ?"

"నేను చెప్పను !"

"మీా నాన్న పేరు ?"

" చెప్పను !"

"ఎందుకని ?"

"నేను పారిపోయి వచ్చాను !"

"ఎందువల్ల ?"

"మా నాన్న నన్ను బళ్ళో చేర్చాడు !"

ఇలాంటి కుర్రవాణ్ణి బళ్ళో వేయటం డబ్బు దండుగ; అది తండ్రి తెలివి లేమిని సూచిస్తూవుందని అతను లోలోపల అనుకున్నాడు.

"మా యింటికి వెళ్దాము, వస్తావా ?"

కుర్రవాడేమీా అభ్యంతరం చెప్పలేదు. ఇంటికివచ్చి దారిలో చెట్టునీడను ఆశ్రయం పొందినట్లు, నదురూ బెదురూ లేకుండా తిరుగుతున్నాడు; పైగా తిండీ తిప్పల విషయంలో ముందే డబ్బు చెల్లించివున్నట్టు, ఇష్టంవచ్చినమాదిరి అధికారం చలాయిస్తున్నాడు. మధ్య మధ్య గృహస్వామితో తగాదా పెట్టుకుంటున్నాడు. కన్న కొడుకుమీాద మన మాట సునాయాసంగా నెగ్గుతుంది; కాని పరాయిపిల్లవాడి యెదుట యజ్ఞనాథే తలవొగ్గవలసి వచ్చింది.

## 3

యజ్ఞనాథునిఇంట్లో నిత్యాయికిజరిగే ముద్దుమురిపాలు చూసి గ్రామస్థులు ముక్కుమీాద వేలు వేసుకున్నారు. 'ముస

లాడు యెక్కువరోజులు జీవించేటట్టులేడు; చస్తూ ఆ పరాయి పిల్లవాడికే తనయావదాస్తి ముట్టజెప్పేటట్టున్నాడని గ్రామస్తులందరికీ కుర్రవాడిమీద ఈర్ష్యగా వుంది. వాడికి యెలా కీడు చేయటమా అని ఆలోచనలో పడ్డారు. కాని వృద్ధుడు నితాయిని కంటికి రెప్పగా చూసుకుంటూ, వాడిని క్షణకాలంకూడా విడిచివుండటంలేదు! పిల్లవాడు నడుమనడుమ వెళ్ళిపోతానని బెదిరించేవాడు. యజ్ఞనాథు వాడితో 'నా ఆస్తి అంతా నీకే యిస్తాన'ని ఆశచూపేవాడు. ఆ కుర్రవాడిది చిన్నవయసే, కాని ఆమాటకు అర్థతాత్పర్యాలు చక్కగా గ్రహించగలుగు!

గ్రామస్థులు ఆ కుర్రవాడి తల్లిదండ్రులెవరో విచారించటం మొదలెట్టారు. 'పాపం ఆ తల్లిదండ్రులు యెంత వటించిపోతున్నారో! ఈ కుర్రకుంక ఇంటికివెళతాననే వూసేఎత్తడు!' అంటూ, బూతుకూతలు కూయసాగారు. వారిలో న్యాయదీక్షకంటె, స్వార్థపరత్వమే మిక్కుటంగా కన్పించేది!

"దామోదరుడనే ఆయన పారిపోయిన కొడుకును వెదుక్కుంటూ ఇటేవస్తున్నాడ"ని ఎవరోబాటసారివృద్ధుని చెవిని వేశాడు.

నితాయికి ఈ వార్త వినగానే ముచ్చెమటలుపోసినవి; వాడు ముందురాబోయే ఆస్తిపాస్తులకు నీళ్ళువదులుకునిఎటైనా పారిపోవ సిద్ధమయాడు.

యజ్ఞనాధుడు వాడితో–"నిన్ను ఎవరూ కనుక్కోలేని తావున వుంచుతాను" అని, నచ్చజెప్పసాగాడు.

నితాయికి కుతూహాలం కలిగింది. "ముందు చూపించు యెక్కడో!"

"ఇప్పుడు చూపితే, రహస్యం వెల్లడిఅవుతుంది. రాత్రికి చూపుతాను!"

నితాయి నూతనరహస్యం చేజిక్కే ఆశతో పుబ్బి పోయాడు. 'మా నాన్న ఊరంతాగాలించి, చిన్నబోయిన మొఖంతో వెళ్ళిపోయినాక, పిల్లలతో దాగుడుమూత లాడు కోవచ్చు! ఎంత వెదికినా, కనపడను. బలే తమాషాగా వుంటుంది. మానాన్న వూళ్లో సందుగొందులన్నీ కాళ్లు అరిగే టట్టు గాలించటమూ, గమ్మత్తుగానేవుంటుంది!' అనుకున్నాడు మనసులో !

ఆమధ్యాహ్నం యజ్ఞనాధుడు నితాయిని ఇంట్లోదాచి, యెక్కడికోవెళ్ళాడు. అతను వచ్చినాక, నితాయి సవాళ్ళు వేసి, వేపుకుతిన్నాడు.

మసక పడకముందే "వెళ్ళుదాం పద !" అన్నాడు నితాయి.

"కనుచీకటి పడనివ్వు!"

"యింకా ఎప్పుడు వెళ్ళేది?"

"అందరూ నిద్రపోయినాక!"

నితాయి క్షణకాలం వూరుకుని "ఇప్పుడు నిద్రపోయా రులే పద" అన్నాడు.

చీకటి దట్టమవుతూంది. కుర్రవాడికి నిద్ర తూలుతూ వుంటే, అతి ప్రయత్నంమీద ఆపుకుంటున్నాడు. అయినా కునికిపాట్లు పడుతున్నాడు. యజ్ఞనాధు అర్ధరాత్రివేళకు నితాయి చేయిపట్టుకుని మాటుమణిగిన వూరి చీకటిదారిన పడి వెళ్ళుతున్నాడు. అంతటా నిస్తబ్ధతగా వుంది. యెక్కడా

ఒక్క పురుగులేదు. అప్పుడప్పుడు కుక్కల అరుపుమాత్రం వినిపిస్తూవుంది. కాళ్ళ అలికిడికి నిశాచరపక్షులు యెగిరి, అడవి కేసి పోతున్నవి. నితాయి అమిత భయపడి, వృద్ధునిచేయి గట్టిగా పట్టుకున్నాడు. ఆకటికచీకట్లో నడిచీనడిచీ చివరకు అడవిలో ఒక పాడుబడిన దేవాలయంలోకి చేరారు.

నితాయి కొంచెం వుదాసీనుడై "యిక్కడా?" అని అడిగాడు.

ఆకుర్రవాడు వూహించినట్టుగాదిరి లేదు. ఇందులో పెద్ద రహస్యమేముంది? తాను ఇల్లువిడిచి దేశ సంచారానికి బయలు దేరినప్పుడు, యెన్నో రాత్రులు ఇలాంటి దేవాలయాల్లో గడిపాడు. ఈ ప్రదేశం దొంగుడుమూతకి పనికిరాక పోదు. కాని దొంగను పట్టుకోటం అతికష్టమేమీ కాదు.

యజ్ఞనాథు గుడిమధ్యలో పెద్దబండతీశాడు. నితాయి లోనికి తొంగిచూశాడు. క్రింద ఒక కొట్టుమాదిరిఉంది. దీపం వెలుగుతూ వుంది. ఆ కుర్రవాడికి సంభ్రమాశ్చర్యాలతో పాటు భయంకూడా కలగసాగింది.

వృద్ధుడు నిచ్చెన వేసుకుని క్రిందికి దిగాడు. అతని వెంట నితాయికూడా జంకుతూ జంకుతూ దిగాడు.

చుట్టూ ఇత్తడిబిందెలు, మధ్యలో ఒకపీట, దానికి ముందు వసుపు కుంకుమ, పూలదండలు – యిత్యాది పూజా ద్రవ్యాలు అమర్చివున్నవి.

నితాయి కుతూహలం కొద్దీ ముందుకు ఒకడుగువేసి చూశాడు. బిందెలనిండా రూపాయలు, మొహరీలు ఉన్నవి.

"నితాయీ! నా యావదాస్తీ నీ కిస్తానని చెప్పలేదూ? నావద్ద పెద్దగా ధనంలేదు. నా సర్వస్వమూ ఈ బిందెలలోదే! ఇవాళ అంతా నీకు సమర్పిస్తాను."

ఆ కుర్రవాడు ఆనందంతో యెగిరి గంతు వేశాడు. "ఈ డబ్బంతా నాదే! ఇందులో ఒక్క రూపాయికూడా తీసుకోవా?"

"తీసుకుంటే నాచేతులువిరగాలి! కాని ఒక్కవిషయం! నామనమడు గోకులుగాని, లేక గోకులు పుత్రపౌత్రాదుల్లో ఎవరైనా గాని వస్తేమాత్రం ఈధనం వాళ్ళకి అప్పగింతపెట్టాలి!"

నితాయి ముసలాడికి మతి మళ్ళిపోయిం దనుకుని, తక్షణమే అతని షరతుకు అంగీకరించి–"సరే!" నన్నాడు.

"అయితే ఈ పీటమీాదకూర్చో!"

"ఎందుకు?"

"నీకు పూజ జరగాలి!"

"దేనికి?"

"అది ఆచారం!"

నితాయి పీటమీాద కూర్చున్నాడు. యజ్ఞనాధు వాడికి మంచిగంధంపూసి, బొట్టుపెట్టాడు; మెడలో పూదండవేసి, యెదురుగా కూర్చుని, అస్పష్టంగా యేవోమంత్రాలు వల్లిస్తున్నాడు.

దైవం మాదిరి, వున్నతాసనం అధిష్ఠించి, మంత్రాలు వినటానికి నితాయి భయభ్రాంతుడై–"తాతా!" అని పెద్దగా అరిచాడు!

వృద్ధుడు మారు మాట్లాడకుండా. మంత్రోచ్చారణ చేస్తున్నాడు.

చివరికి కష్టంమీద వొకొక బిందె, నితాయి దగ్గరకు, లాగి, సమర్పిస్తున్నాడు. "నితాయీపాల్ నయిన నేను, పరమానంద కుండూపుత్రుడు యజ్ఞనాథకుండూ, తస్యపుత్రుడు బృందావనకుండూ, తస్యపుత్రుడు గోకులచందుకుండూ, లేక అతని పుత్రపౌత్రులకూ లేక న్యాయంగా చెందవలసిన అతని వంశీకులకు యావత్తు స్థిరచరాస్తులు అప్పగించగలను" అని నితాయిచేత ప్రతీసారీ చెప్పించాడు.

ఇలా వొకేమాట వుచ్చరించీ, వుచ్చరించీ కుర్రవాడు హతబుద్ధి అయాడు. వాడిమాట తడబడుతూంది. ఈ అనుష్టానం పూర్తి అయ్యేవరకు, దీపపు పొగకూ, చెడుగాలికీ లోపలంతా ఆవిరితో నిండిపోయింది; కుర్రవాడి నాలుక తడి ఆరింది; కాళ్ళూచేతులు వెచ్చబడినై; వూపిరాడని పరిస్థితి యేర్పడింది.

దీపంకొండి తగ్గి, ఆరిపోయింది గప్పుమని! ఆ చీకట్లో యజ్ఞనాథు నిచ్చెన యెక్కి పైకివెళ్ళుతున్నాడని కుర్రవాడు గ్రహించి, వ్యాకులపడుతూ – "యెక్కడికి వెళ్ళుతున్నావు తాతా?" అని అడిగాడు.

"నేను వస్తాను. నీవు ఇక్కడే వుండు; ఇక నిన్ను నరమానవుడు కనుక్కోలేడు. కాని గుర్తుపెట్టుకో, యజ్ఞనాథుని పౌత్రుడు, బృందావనుని పుత్రుడు గోకుల్‌చందు"–అని చెప్పి ఆ వృద్ధుడు పైకివచ్చి, నిచ్చెన లాగివేశాడు.

పిల్లవాడికి వూపిరాడటంలేదు. నూతిలోనుంచి మాట్లాడు

తున్నట్టు – "తాతా, నేను మా నాన్న దగ్గరకు వెళ్ళుతా" నన్నాడు.

యజ్ఞనాథు బండమూతపెట్టి చెవిఆనించి వింటున్నాడు– నితాయి క్షీణస్వరంలో చివరిసారిగా "నానా నానా" అంటున్నాడు.

కొంచెంసేపటికి ఏదోపడిన చప్పుడయింది; ఆ తర్వాత శబ్దమూ వినిపించలేదు. తన యావదాస్తి అప్పగింతపెట్టి, ఆ వృద్ధుడు బండను మట్టితో కప్పివేయసాగాడు. దానిమీద పాడుపడిన గుడిలోని ఇటుకరాతిముక్కలు పేర్చి, పచ్చిక, మొక్కలుకూడా పెట్టాడు. ఇంచుమించు తెల్లవారవస్తోంది. కాని అతను ఆతావువిడిచి వెళ్ళలేకపోయాడు. మాటిమాటికీ నేలకు చెవిఆనించి వినటానికి ప్రయత్నించసాగాడు. బహు దూరాన, పాతాళంలోనుంచి విలపిస్తున్నట్టుగావుంది. ఆరాత్రి ఆకాశమంతా ఆధ్వనితోనే ప్రతిధ్వనిస్తున్నట్టు, నిద్రావస్థలో వున్న సమస్తభూతకోటీ తమ పక్కలమీదనుంచి లేచికూర్చుని చెవియొగ్గి వింటున్నట్టుగా తోస్తోంది.

యజ్ఞనాథు తడబడుతూ, వూరికే మట్టిపోస్తున్నాడు లోకం నోటికి మూతపెడదామన్నట్టు!

"నానగారూ!" అని పిలుస్తున్నది యెవరబ్బ!

ఆ వృద్ధుడు మట్టిని కాలితోతన్ని–"యెవరైనావింటారు. మాట్లాడమాకు!" అన్నాడు.

మళ్ళీ యెవరో నానగారూ అనిపిలిచారు.

ప్రొద్దెక్కింది! అతను భయపడుతూ పొలాలకేసి సాగాడు.

అక్కడకూడా యెవరో 'నానగారూ' అని కేక పెట్టినట్టుంది! యజ్ఞనాథు త్రుళ్ళిపడి వెనుదిరిగి చూశాడు—బృందావనుడు!

"నానగారూ! మా అబ్బాయి మీ దగ్గరకు వచ్చి, దాగాడని తెలిసింది. యేడీ వాడు?" అని అడిగాడు బృందావనుడు.

యజ్ఞనాథు ముఖం చిట్లించుకుని, బృందావనుని ముఖం కేసి వంగిచూస్తూ "నీ కొడుకా!" అన్నాడు.

"అవును, గోకుల్! ఇప్పుడు వాడిపేరు నితాయిపాల్! నాపేరేమో దామోదరుడు! చుట్టుపక్కల మా పేరు ప్రతిష్టలుచూసి, సిగ్గుతో పేర్లుమార్చుకున్నాము. లేకపోతే వచ్చి మంచినీళ్ళు పుట్టేవా?"

ఆమాట చెవిని పడగానే యజ్ఞనాథు శూన్యాన్ని చేతులతో తడవుతూ, గాలిని పట్టుకోటానికి ప్రయత్నించి నట్టుంది. కాని చేతికి ఏమీచిక్కలేదు, వున్నట్టుండి విరమించుకుని నేలమీాద పడిపోయాడు.

తెలివి వచ్చినాక, బృందావనుణ్ణి గుడివైపు లాక్కు వెళ్ళి—"యేడ్పు విన్పిస్తోందా?" అని అడిగాడు.

"లేదే!"

"చెవి ఆనించి, విను! 'నానా' అని యెవరైనా పిలుస్తున్నారా?"

"లేదు!"

యజ్ఞనాథు అప్పుడు పూర్తిగా నిశ్చింతుడైనట్టుంది.

ఆరోజునుంచీ యజ్ఞనాథు అందరినీ "యేడ్పు వినిపిస్తుందా?" అని అడుగుతుంటాడు.

ఆ మతిలేని మాటకు అందరూ నవ్వుకునేవారు.

ఇలానే నాలుగైదు సంవత్సరాలు గడిచినై. యజ్ఞనాథుకు చివరి గడియలు సమీపించినవి. కళ్ళకు చీకట్లు కమ్మినవి; యెగశ్వాస ప్రారంభమయింది. ఆ వికారోద్రేకంలో లేచి కూర్చుని, నలుదిక్కుల రెండుచేతుల్తో తడవుతూ. "నితాయీ నా నిచ్చెన యెవరుతీశారు ?" అని అన్నాడు.

యజ్ఞనాథుకు, గాలిరాని ఆ చీకటిబిలంలో నుంచి వెలికిరావటానికి నిచ్చెన దొరకకపోయేటప్పటికి, మళ్ళీ మంచం మీాద పడిపోయాడు; అతను ఈ నశ్వరజగత్తు అహోరాత్రులు దాగుడుమూతలాటలో, ఒకర్ని ఒకరు అన్వేషించే సావకాశం లేని తావుకు ప్రయాణమయాడు !

— : —

# రవీంద్రుని రచనలు

| | | | |
|---|---|---|---|
| రాణీఘాట్ | నవల | 3 | 0 |
| శేషకవిత | ,, | 3 | 0 |
| పూదోట | ,, | 2 | 0 |
| కంటకం | ,, | 3 | 0 |
| చదరంగం | కథలు | 2 | 0 |
| కూలినకుటీరం | ,, | 2 | 0 |
| లేబరేటరి | ,, | 2 | 0 |
| రవీంద్ర కథామంజరి | ,, | 3 | 0 |
| ముక్తధార | నాటకం | 2 | 0 |
| గీతాంజలి | గేయాలు | 2 | 0 |